## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000001069

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఆ ము ఖ ము

భాస మహాకవి ప్రప్రథమ సంస్కృత నాటక నిర్మాత. ఈ మహాకవి కాళిదాస భవభూతులకు మార్గదర్శకుఁడు. ఈయన తరువాతి నాటకకవు లెందరో యీయన యడుగుజాడలలో నడచిరి.

భాస విరచితములైన రూపకములు చిన్నవి పెద్దవి మొత్తము పదమూఁడు లభించినవి. ఈ మధ్య మఱియొకటి లబ్ధమైనది. వీని యన్నింటి యందు "ప్రతిమా నాటకము" న కొక ప్రత్యేకస్థాన మున్నది. కారణము పావనమైన రామాయణము భారతీయ జీవనజ్యోతి యగుటయే.

రామాయణ కథ – రమణీయమైన రచనా విధానము. ఇంకేమి! పసిడికి పరిమళ మబ్బినది. భాసుని కమనీయ కవితా కళా కౌశల్యము, అనల్ప శిల్ప కల్పనా చాతుర్యము "ప్రతిమ" లో నెల్లెడల నప్రతిమముగ విరాజిల్లుచున్నవి.

పాత్రల సంభాషణములు సరసములు. స్వాభావికములు. సర్వథా సముచితములు. భాసుని యతులిత ప్రతిభాప్రాభవము రసోల్లసితములు మహాద్భుతములు నగు నూతన కల్పనములకు దారితీసినది. సీతారాముల వల్కలధారణమేమి, భరతుని ప్రతిమాగృహ సందర్శనమేమి, దశరథుని ప్రత్యాబ్దిక శ్రాద్ధ కల్పనమేమి, భాసుని ప్రతిభా ప్రదర్శనమునకు నిదర్శనములు.

శ్రీరాముని పితృవాక్య పరిపాలనాసక్తిని, సీతాదేవి భర్తృ సహధర్మ చరణానురక్తిని, భరత లక్ష్మణుల పవిత్ర భ్రాతృభక్తిని భాస మహాకవి సువర్ణలేఖిని సుందరముగ దిద్ది తీర్చినది. పరమ పవిత్రము అగు నిట్టి యాదర్శ చరిత్రములే భారత సౌభాగ్య లక్ష్మికి మంగళసూత్రములు.

కథాగౌరవము చేతను, కల్పనా సౌందర్యము చేతను "ప్రతిమ" నన్నాకర్షించినది. దీనిని నా శక్తి కొలంది సరళ శైలిలో ననువదించి యాంధ్ర సోదరుల హస్తసరోజములం దుంచితిని. ఇందలి సారళ్య సారస్యములను సంభావించి నేను కావించిన యీ కృషిని సార్థక మొనరింపవలెనని విజ్ఞులైన పాఠకు లకు, విద్యాలయాధికారులకు, విశ్వవిద్యాలయాధికారులకు వినయపూర్వకముగా విన్నవించుకొనుచున్నాను.

"సుధాంశు"

# పాత్రలు

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| రాముఁడు | సీత |
| లక్ష్మణుఁడు | కౌసల్య |
| భరతుఁడు | సుమిత్ర |
| శత్రుఘ్నుఁడు | కైకేయి |
| దశరథుఁడు | అవదాతిక |
| సుమంత్రుఁడు | విజయ |
| కాంచుకీయుఁడు | నందినిక |
| దేవకులికుఁడు | తాపసి |
| రావణుఁడు | ప్రతీహారి |
| సూతుఁడు | చేటి |
| నందిలకుఁడు | నటి |

తాపసులు

సూత్రధారుఁడు

# ప్రథమాంకము

*[ నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును ]*

సూత్రధారుఁడు :

తోషితసుమిత్రుఁ డహిత విభీషణుండు 1
రావణమదాపహారి సుగ్రీవసఖుఁడు
భరతలక్ష్మణసహితుఁ డప్రతిమబలుఁడు
రామవిభుఁడు సీతానాథుఁ డోము మిమ్ము.

దేవీ ! ఇటురా!

నటి : (ప్రవేశించి) ఆర్యా ! వచ్చితిని.

సూత్ర : చెలీ ! ప్రస్తుత శరత్కాలశోభ ననుసరించి యొక మధుర గీతము నాలపింపుము.

నటి : చిత్తము. (గానము చేయును)

సూత్ర : ఈ కాలమునందు—

హంసి హర్షాన నట్టిట్టు లడుగు లిడెడుఁ
బులిన తలులఁ గాశాంకుశమును ధరించి;

(నేపథ్యములో) ఆర్యా ! ఆర్యా !

సూత్ర : (ఆలకించి) మంచిది. గ్రహించితిని.

రాజ సౌధమ్ములో సత్వరము ముదాన
నటునిటు చరించు నీ ప్రతీహారి వోలె ! 2

*(ఇరువురు నిష్క్రమింతురు)*

*[ఇది స్థాపన]*

ప్రతీహారి : (ప్రవేశించి) ఆర్యా ! కాంచుకీయులలో నిక్కడ నెవ్వరున్నారు ?

(కాంచుకీయుఁడు ప్రవేశించును)

కాంచుకీయుఁడు : అమ్మాయీ ! ఇదిగో నేనున్నాను ఏమి పని ?

ప్రతీ : ఆర్యా ! సురాసురసంగ్రామమున నప్రతిహతమహారథుఁడైన దశరథమహారాజు రాకుమారుఁడైన రాముని రాజ్యాభిషేకమునకై సమస్త సంభారములు సమకూర్పుఁడని యాజ్ఞాపించుచున్నాడు.

కాంచుకీ : అమ్మాయీ ! ప్రభువుల యనుజ్ఞప్రకారము సర్వమును సంసిద్ధమైనది. ఇదిగో చూడు—

కాంచన భద్రపీఠి పరికల్పితమయ్యెను ఛత్రచామరో
దంచితమై; ధ్వనించె పటహమ్ములు; పుష్యరథమ్ము వెళ్గె; నే
తెంచిరి పౌరు లెల్లరు; సతీర్థ సువర్ణఘటావళుల్ సుమా
భ్యంచితముల్; వశిష్ఠ భగవానుఁడు వేదిక నెక్కె మేలుగన్. 3

ప్రతీ : ఐన మీరు చాలఁ జక్కఁగా నేర్పాటుచేసితిరి.

కాంచుకీ : అహో ! మహానందము.

కువలయానందకరుఁ దన కొమరు రామ
చంద్రు గుణసాంద్రు యౌవరాజ్యమున నిలిపి
జనుల నందఱ ధన్యజీవనులఁ జేసె
ధర్మసంత్రాత దశరథధరణినేత. 4

ప్రతీ : ఇఁక మీరు త్వరపడవలయును.

కాంచుకీ : అమ్మాయీ ! ఇదిగో పోవుచున్నాను. (నిష్క్రమించును)

ప్రతీ : (పరిక్రమించి) ఆర్యా ! సంభవకా ! రాజాజ్ఞానుసారము సముచిత గౌరవోపచారములతో రాజపురోహితుని సత్వరముగాఁ దీసికొని రమ్ము. (మఱియొక ప్రక్క కరుగుచు) సారసికా ! సార

సికా ! సంగీతశాలకుఁ బోయి ప్రకృతోచిత మగు నాటకప్రదర్శ
నమునకు సంసిద్ధము కావలెనని నటవర్గము నాదేశింపుము. నేను
ప్రభుసమక్షమున కేగి సర్వమును సంసిద్ధమైనదని నివేదించుదును.

*(నిష్క్రమించును)*

*(వల్కలము గైకొని అవదాతిక ప్రవేశించును)*

అవదాతిక : ఆహా ! ఎంత వింత ! వినోదమున కె వల్కలము గైకొని
వచ్చిన నాకే యింత భయముగా నున్నదే ! ఇఁక కావలెనని లోభ
ముతోఁ బరధనమును దొంగిలించువారి పరిస్థితి ఎట్లుండునో ! నాలో
నాకే నవ్వు వచ్చుచున్నది. కాని యొంటరిగా నవ్వుకొనుటలో
సొగసు లేదు.

*(సపరివారముగ సీత ప్రవేశించును)*

సీత : (చెలితో) సఖి ! అవదాతిక ఏదో యనుమానాస్పదముగాఁ గను
పించుచున్నది. కారణ మేమైయుండును ?

చేటి : దేవీ ! పరిజనమునకుఁ దప్పులు చేయుట పరిపాటియే ! ఏదో
యపరాధము చేసియుండును.

సీత : కాదు కాదు. నవ్వులాటకే మో ?

అవ : (సమీపించి) జయము జయము దేవీ ! నే నపరాధిని గాను.

సీత : ఇప్పుడు నిన్నెవ్వ రడిగిరి ? అవదాతికా ! నీ యెడమ చేతిలో
నున్న వస్తువేమిటే ?

అవ : దేవీ ! ఇది వల్కలము.

సీత : వల్కలము నెందులకుఁ దెచ్చితివి ?

అవ : వినండి దేవీ ! నాటక రంగాధికారిణి యగు రేవాదేవిని ప్రదర్శ
నానంతరము పని దీరిపోయిన యశోకకిసలయ మంజరిని నా
కిమ్మని యడిగితిని. కాని యామె యీయలేదు. అందులకుఁ బ్రతీ
కారముగా నేనీ నారచీరను దీసికొనివచ్చితిని.

సీత : నీవు చాల తప్పుపని చేసితివి. పొమ్ము. వెంటనే దీని నామె కప్పగించి రమ్ము.

అవ : దేవీ ! కేవలము పరిహాసమునకే నేను దీని నెత్తుకొనివచ్చితిని.

సీత : ఓ యున్మాదినీ ! నీ మార్గ మపరాధము నభివృద్ధి చేయును. పో పొమ్ము. దీనిని తిరిగి యిచ్చివేయుము.

అవ : తమ యాజ్ఞానుసారమే చేసెదను. (పోఁబోవును)

సీత : చెలీ ! ఇటు రా.

అవ : (సమీపించి) ఏమిటి దేవీ ?

సీత : దీనిని నేను ధరించిన నెట్లుండునో ?

అవ : దేవీ ! చక్కని రూపము సమస్తమును శోభింపఁజేయును. ఇదుగో వల్కలము. అలంకరించుకొనుఁడు !

సీత : ఏదీ ఇటు తెమ్ము. (వల్కల మందుకొని యలంకరించుకొనుచు) చూడు చెలీ ! ఇప్పుడు బాగున్నదా ?

అవ : మీ కేమి బాగుండకపోవుట యేమి ! మీ కమనీయ దేహస్పర్శముచే నీ వల్కలము కనకమయమై కాంతులు చిమ్ముచున్నది.

సీత : (చేటితో) ఏమే ! నీ వేమియు మాటాడవు ?

చేటి : దేవీ ! పలుకులతో ప్రయోజన మేమి ? ఇవిగో ! ఈ పులకాంకురములే నా ప్రమోదమును ప్రకటించుచున్నవి.

*(రోమాంచము చూపించును)*

సీత : చేటీ ! ఒకమాటు అద్దము తీసికొనిరావే !

చేటి : చిత్తము. (అద్దమును గొనివచ్చి) దేవీ ! ఇదిగో దర్పణము.

సీత : (చేటి వదనము నవలోకించుచు) అద్దము మాట సరేకాని నీ వేదో చెప్పదలచినదానివలె కనుపించుచున్నావు ?

చేటి : దేవీ ! ఆర్యకంచుకి బాలాకి "పట్టాభిషేకము. పట్టాభిషేకము" అని పలుకుట విన్నాను.

(మఱియొక చేటి ప్రవేశించును)

చేటి : దేవీ ! దేవీ ! శుభవార్త ! శుభవార్త !

సీత : ఏమిచే యీ సంబరము ! ఏమిచే ఆ శుభవార్త !

చేటి : యువరాజుగారి పట్టాభిషేకమమ్మా !

సీత : మహారాజుగారికి కుశలమే కదా ?

చేటి : స్వయముగా మహారాజుగారే పట్టాభిషేకము చేయుచున్నారమ్మా !

సీత : మంచిది. మఱొక మంచి వార్త, చెలీ ! ఏదీ ఇటురా ! నీ యొడి పట్టు

చేటి : చిత్తము దేవి ! (ఒడి పట్టును.)

సీత : (తన యాభరణము లన్నియుఁ దీసి ఇచ్చును)

(తెరలో భేరీధ్వని)

చేటి : దేవీ ! విజయభేరివలె వినుపించుచున్నది !

సీత : ఔనౌను అదే !

చేటి : ఇదేమి ! ఉన్నట్లుండి భేరీనినాద మాగిపోయినది !

సీత : అభిషేకమున కేమైన యాటంకము కలిగినదేమో ! సాధారణముగా రాజభవనములు వివిధ విచిత్ర సంఘటనముల కాకరములై యుండును.

చేటి : దేవీ ! యువరాజ పట్టాభిషేకానంతరము మహారాజు విపినముల కేగుననియు విన్నాను.

సీత : అట్లైన నది యభిషేకోదకము కాదు. ముఖోదకము !

(రాముఁడు ప్రవేశించును)

రాముఁడు : ఆహా !

జయభేరుల్ నినదింప, సద్గురువరుల్ సానందులై నిల్వ, గ
ద్దియపై నే వసియింప, మేల్పసిడి బిందెల్ పుణ్యతీర్థమ్ము నా
పయి వర్షించెడివేళ వద్దనెను భూపాలుండు; నన్ గాంచి వి
స్మయమందెం బ్రజ; తండ్రిమాటఁ దనయుల్మన్నించుటాశ్చర్యమే.

ఇప్పుడు నా హృదయమునకుఁ బ్రశాంతి లభించినది. పట్టాభిషేక భారమునుండి నేను విముక్తుఁడ నైతిని. "కుమారా ! ప్రకృతమున కీ ప్రయత్నమును విరమింతము" అని మహారాజే నా కీవలికి వచ్చుట కనుజ్ఞ దయచేసినాడు. అదృష్టవశమున రాముఁ డెప్పటి రాముఁడే! మహారాజు మహారాజే ! ఇంక జానకిని సందర్శింతును.

అవ : దేవీ ! యువరాజు వచ్చినారమ్మా ! మీ రింకను నారచీర విప్పనే లేదు.

రామ : (సమీపించి) జానకీ ! ఏమిటి విశేషములు ?

సీత : ఓహో ! ఆర్యపుత్రులా ! జయము. జయము.

రామ : జానకీ ! రమ్ము. కూర్చుందము. (రాముఁడు కూర్చుండును )

సీత : చిత్తము. ఆలాగే ! (కూర్చుండును)

అవ : దేవీ ! యువరాజు వేషభూష లట్లే యున్నవి. మనము విన్న సమాచార మంతయు సత్యదూరమై యుండును.

సీత : కాని యా చేటిక యసత్యవాదిని కాదు. నేను చెప్పితిని కదా ! రాజభవనములు సాధారణముగా వివిధ విచిత్ర సంఘటనముల కాకరములై యుండును.

రామ : జానకీ ! మీ రేవిషయమునుగూర్చి మాటలాడుచున్నారు ?

సీత : మరేమియు లేదు. ఈమె పట్టాభిషేకము పట్టాభిషేకమని పలుకుచున్నది.

రామ : నీ కౌతూహలము గ్రహించితిని. అవును దేవీ ! పట్టాభిషేకము నిర్ణయింపఁబడినది. ఆలకింపుము. నేఁడు మహారాజు గురుమంత్రి జన సమక్షమున బాల్యపరిచితమైన ప్రేమాంకముపైనన్ను గూర్చుండఁ బెట్టుకొని మాతృగోత్రమును సానురాగముగా సంస్తుతించుచు "కుమారా ! శ్రీరామా ! సమస్త కోసల సామ్రాజ్య భారమును నీవు పరిగ్రహింపుము" అని పలికెను.

సీత : అందుల కార్యపుత్రు లేమనిరి ?

రామ : జానకీ ! ఏమని అనియుందునను కొందువు ?

సీత : ఆర్యపుత్రులు నిరుత్తరులై ఒక్క దీర్ఘనిశ్వాసము పుచ్చి మహారాజు పాదపద్మములపై వ్రాలియుందురనుకొందును.

రామ : దేవీ ! నీవు సముచితముగా సంభావించితివి. సమస్వభావము గల దంపతు లెక్కడో కాని కనుపింపరు ? సరిగా నీ వన్నట్లే నే నాయన చరణసరోజములపై వ్రాలితిని.

జనకు నయనాల వెంట నా కనుల వెంట
సమముగా బాష్పధారలు జాలువాఱె ;
తండ్రి కన్నీట నాదు మూర్ధమ్ము తడిసె
నాదు బాష్పాల తచ్చరణముల కరణి. 6

సీత : తరువాత నేమి జరిగినది ?

రామ : అనంతరము నాయనగా రెన్నియో విధముల బతిమాలినారు. కాని మొదట నే నంగీకరింపలేదు. ఆసన్న వార్ధక్యములైన యాయన వాక్యములకు కడకు నేను తప్పనిసరిగా లొంగిపోతిని.

సీత : తరువాత తరువాత !

రామ : తరువాత—

చెలఁగి లక్ష్మణుం డభిషేక కలశ మూనె
రాజు కన్నీళ్ళతోడ ఛత్రము వహించె—
తడబడుచు వచ్చి పలికె మంథర యదేమొ
ప్రభువు చెవిలోన, నా "పట్టభంగ" మయ్యె. 7

సీత : ఇది నా కత్యంత మానందకరమైన విషయము. ఇఁక మహారాజు పూర్వమువలె మహారాజే! ఆర్యపుత్రు లెప్పటివలె ఆర్యపుత్రులే!

రామ : జానకీ! అలంకారములు తీసివేసితి వెందులకు?

సీత : లేదు. నేను వాని నింకను ధరింపనే లేదు.

రామ : కాదు. అట్లు కనుపించుట లేదు. నీ యాభరణము లన్నియు నిప్పుడే తీసివేసి యుందువు ఏమందువా —

కమ్మలను దీయు త్వరలోనఁ గందెఁ జెవులు
కంకణము లూడ్వఁ గమలెను గరయుగమ్ము
ఆభరణభార నతములౌ నవయవముల
నొరపులై నను మాయలే దరయ నింత. 8

సీత : ఆర్యపుత్రు లసత్యమునుగూడ సత్యముగా నిరూపింపఁ గలరు.

రామ : ఐనచో నలంకరించుకొనుము. నేను దర్పణము ధరింతును. (అట్లు చేసి తిలకించుచు) ఉండుము —

లలన! అద్దంబులో వల్కలమ్ము లట్లు
భాను భానువు లేమొ ప్రభల్ వెలార్చె;
నవ్వుచున్నావు తెలిసికొన్నానులెమ్ము!
ఏది యేని వ్రతమ్మొ? వినోదమునకొ? 9

అవదాతికా! ఏమది?

అవ : ప్రభూ! నారచీరలు తనకు బాగుండునో లేదో చూతమని దేవి ధరించినది.

రామ : జానకీ! ఏమిటిది? వృద్ధులైన యిక్ష్వాకువంశీయులు ధరించు నీ యలంకారము నీవు ధరించితివి. నాకును దానిపై నభిలాష యంకురించుచున్నది. నాకుఁగూడ నొక వల్కలము నిమ్ము.

సీత : వలదు వలదు. ఆర్యపుత్రు లిట్టి యమంగళవాక్యము లాడకుఁడు.

రామ : జానకీ! ఏల వారింతువు?

సీత : పట్టాభిషేకోత్సవ మిప్పుడే యాగిపోయిన ఆర్యపుత్రుల విషయములో నా కిదేదో యశుభ సూచకముగాఁ దోఁచుచున్నది.

రామ :

ఇది పరిహాస విషయమే! యింతలోన
నింతటి యశాంతి వహియింతు వేల బేల!
ప్రీతి నర్ధాంగి వీవు ధరించినపుడు
కట్టుకొన్నట్లు గాదె వల్కలము లేను! 10

*(నేపథ్యములో)*

అయ్యో! అయ్యో! మహారాజు!

సీత : ఆర్యపుత్రా! అదేమైయుండును?

రామ : ( ఆకర్ణించి )

ఆడువారలు మగవార లలవిమాలి
యవధి దప్పి గొంతెత్తి బిట్టఱచినారు
సకల దక్షుఁడ నుంటి నే నొకఁడ నంచు
దేవుఁ డేదియో మొదటికే దెబ్బగొట్టె. 11

ఎవరక్కడ! ఆ శబ్దమేమో వెంటనే తెలిసికొనుఁడు.

కాంచుకీ : రాజకుమారా! రక్షింపుము. రక్షింపుము.

రామ : ఆర్యా! ఎవరిని రక్షింపవలయును?

కాంచుకీ : మహారాజును.

రామ : ఏమీ ! మహారాజునా ? కాదు. ఏకశరీర సంరక్షితమైన భూమండలమును రక్షింపుమని పలుకుము. ఇంతకు నీ ప్రమాద మెవరివలనఁ బ్రాప్తించినది ?

కాంచుకీ : ఐనవారి వలననే !

రామ : ఏమంటివి ! ఐనవారి వలననా ? ఐన దీనికిఁ బ్రతీకారమే లేదే !

అరి శరీరమ్ము నే గాయపరుచుగాని
మించి స్వజనుఁడు మానసమే దహించు ;
నెట్టి బాంధవ్య మిట్టి యకృత్యమునకుఁ
బాల్పడెనో నన్ను సిగ్గులపాలు జేయ ? 12

కాంచుకీ : పూజ్యురాలైన కైకేయీదేవి వలననే యీ యుపద్రవము సంభవించినది.

రామ : ఏమీ ! అమ్మగారి వలననా ? అయినచో భావిఫల ప్రదాయక మగు విశేష మిందేదో యుండును.

కాంచుకీ : ఎట్లు ?

రామ : వినుము.

శక్రసముఁడైన దశరథేశ్వరుని పత్ని
నన్ను బోలిన కొమరునిఁ గన్నతల్లి
ఎట్టి విపరీత ఫలము వాంఛించి యామె
యిట్టి దుష్కార్యమున కొడిగట్టనేర్చు ? 13

కాంచుకీ : రాజకుమారా ! వివేకవిహీన మైనది స్త్రీ స్వభావము. ఈ విషయములో నార్జవము సముచితము కాదు. ఆమె వాక్యము వలననేగదా మీ యభిషేకోత్సవమున కాటంకము వాటిల్లినది.

రామ : కాని యిందు ప్రయోజనము లున్నవి.

కాంచుకీ : సెలవిండు.

రామ : వినుము.

నరపతి వేగిరమ్ముగ వనమ్మున కేగఁడు – తండ్రి చాటునన్
బెరిగెడు బాలభావము నివృత్తము కాదిక నాకు – నీ మహో
ర్వర పరిపాలనమ్మున నవప్రభుఁ డన్న విమర్శ సుంతయున్
జరుగదు – తమ్ములన్ విడువఁజాల వుదంచిత రాజ్యభోగముల్. 14

కాంచుకీ : కాని యామె మహారాజు ననాహూతయై సమీపించి భరతుడు సింహాసనాసీనుఁడు కావలెనని కోరినది. ఇందును రాజ్యలోభము లేదందురా ?

రామ : ఆర్యా ! నీవు నామీది పక్షపాతమున సత్యమును గ్రహింపలేకున్నావు. ఏలయన—

రమణి శుల్క సంప్రాప్తమౌ రాజ్య మెల్ల
కొమరు కోసరమై కోరుకొనుట తగదె ?
తప్పుగా నెంచె దీవు – సోదరుని రాజ్య
మపహరించుట నాది పేరాసగాదె ! 15



కాంచుకీ : కాని—

రామ : ఇంక మాతృదూషణమునకు నేను చెవి యొగ్గఁజాలను. మహారాజు వృత్తాంతము మాత్ర మెఱిఁగింపుము.

కాంచుకీ : అనంతర మా సమయమున—

శోకవశమున మాటాడలేక నృపతి
చేతితో నన్నిటకు సైగచేసి పంపె ;
మానసములోనఁ గల యభిమత మదేమొ—
ముంచుకొని వచ్చు దుఃఖాన మూర్ఛవోయె. 16

రామ : ఏమీ ! ఆయన మూర్ఛితులైనారా ?

(నేపథ్యములో)

ఎట్టెట్టూ? "ఆయన మూర్ఛితులైనారా?" అని అనుచున్నారా!

నరపతి మూర్ఛనందుట మనమ్మున సైపవయేని వే ధను
ర్ధరుఁడవు కమ్ము లెమ్ము! దయదాల్పఁగ నియ్యది వేళ కాదు,

రామ: (విని ముందునకు చూచుచు)

ధైర్యవారాశి యగు సుమిత్రాసుతుండు
సంక్షుభితుఁ డయ్యెనే స్వనిశ్చలత వీడి,
వంచలకొలంది లక్ష్మణుల్ ముందునిలిచి
నట్లు తోఁచు సీతని యాగ్రహంబు చూడ. 17

(ధనుర్బాణములు ధరించి లక్ష్మణుఁడు ప్రవేశించును.)

లక్ష్మ: (కోపముతో) ఎట్టెట్టూ? "ఆయన మూర్ఛితులైనారా?" అనియా అనుచున్నారు—

నరపతి మూర్ఛనందుట మనమ్మున సైపవయేని వే ధను
ర్ధరుఁడవు కమ్ము లెమ్ము! దయదాల్పఁగ నియ్యది వేళ కా, దిటుల్
కరుణ వహించు బాంధవులకై యెవఁ డట్టిఁడు కుందుఁజెందు, నీ
సరణి రుచింపదా! విడుము సాంతము నాశముచేతు కాంతలన్. 18

సీత: ఆర్యపుత్రా! సౌమిత్రి కన్నీరుపెట్టవలసిన వేళ కార్ముకము పట్టినాఁడు. ఈ యర్థములేని యాయాస మపూర్వము.

రామ: సౌమిత్రీ! ఇదేమి?

లక్ష్మ: ఏమంటిరి? ఇదేమనియా!

ధరణిపతి శోచనీయ దుర్దశ మునింగె
సక్రమ ప్రాప్తరాజ్యమ్ము జాఱిపోయె
నిప్పటికిఁ గూడ తటపటాయించుటనిన
శాంతియో! కానిచోఁ జేతగానితనమొ? 19

రామ : సౌమిత్రీ ! నా పట్టభంగము నిన్నీపనికిఁ బురికొల్పినది. కాని పాపము నీ వెంత యజ్ఞానములోఁ బడిపోయితివి !

భరతుఁడే గద్దె నెక్కి భూపాలుఁడైన
మేమె యైనను భేద మేమియును లేదు ;
తావక శరాసనము సమర్థమ్మ యేని
దీక్షగొనుము తద్రాజ్య సంరక్షకొఱకు. 20

లక్ష్మ : నేను నా యాగ్రహమును నిగ్రహించుకొనలేను. కానిండు. ఇఁక నేను వెడలిపోవుచున్నాను.

(బయలుదేరును)

రామ :

సాగ్రహుండైన వీరలక్ష్మణకుమారు
నిటలతట సంఘటిత చలత్కుటిల భ్రుకుటి
చెలఁగు ముల్లోకములను భస్మీకరింప
నియమితంబయి, నిష్ఠుర నియతి రీతి. 21

సౌమిత్రీ ! ఇటు రమ్ము.

లక్ష్మ : ఆర్యా ! వచ్చితిని.

రామ : నేను నీ హృదయమున స్థిరత్వము నెలకొల్పుటకై యట్లు పలికితిని. ఇఁక నిప్పుడు చెప్పుము.

సత్యము కోసమై నను విసర్జన చేసినవాఁడు తండ్రి — స్వా
పత్యము కోసమై యడిగె స్వత్వము రాజ్యము తల్లి — దోష సాం
గత్యములేని సోదరుఁ — డికన్ మఱి వీరలలోన నెవ్వరిన్
హత్యయొనర్పఁగాఁ దగు—శరాసన మెవ్వరిపైన నెత్తుదున్ ? 22

లక్ష్మ : ( సబాష్పముగా ) అయ్యో ! నా మనసు దెలిసికొనకుండ నన్ను నిందించున్నారు.

ధరణి నేలుట నా వాంఛితమ్మె కాదు
మొత్తుకొనుచుంటి నే భవిష్యత్తు నెంచి ;
ఎట్టు లుందురు పదునాలు గేండ్లు మీరు
కంటకాకీర్ణ కర్కశ కాననముల ! 23

రామ : ఇందులకే కాఁబోలు నాయనగారు మూర్ఛాక్రాంతులైనారు ! ఆహా ! ఆయన నిస్పహాయత యవగతమైనది. జానకీ !

తెమ్ము తె మ్మిమె శుభమంచు తెచ్చినట్టి
వల్కలమ్ములు నా వనవాసమునకు ;
అన్యనృపతులు సలుపని యందుకొనని
ధర్మసత్క్రియ నే జేయఁదలచినాడ ! 24

సీత : ( వల్కలము లిచ్చుచు ) ఆర్యపుత్రా ! గ్రహించండి.
రామ : జానకీ ! నీ వేమిచేయ నెంచితివి ?
సీత : నేను మీ సహధర్మచారిణినే కదా !
రామ : కాని నే నేకాకినైయటగా యేగవలయును.
సీత : అందులకే నేను మిమ్మనుసరింపవలయును.
రామ : అచ్చట నరణ్యములో వసింపవలయును సుమా !
సీత : మీ వెంటనున్నచో నరణ్యమే యపరంజిమేడ.
రామ : మఱి యత్తమామల శుశ్రూషయు నవశ్యకర్తవ్యమే గదా !
సీత : వారి క్షేమమునకై భగవంతుని బ్రార్థింతును.
రామ : సౌమిత్రీ ! ఈమెను నీవైన నివారింపుము.
లక్ష్మ : ఆర్యా ! శ్లాఘనీయమగు వదినెగారి సంకల్పము గాదనుటకు నాయంతరంగ మంగీకరించుటలేదు. ఏమందురా !

తార పరిత్యజింపదు సుధాకరు రాహువుచేత జిక్కినన్ –
భూరుహ మూర్విఁగూలఁ బడిపోవును తీవయు – పంకలగ్నమౌ
వారణవల్లభున్ గరిణి వాయదు – మీ వెనువెంట నీమెకున్
దారి యొసంగుడీ ! శత విధాల సతుల్ సహధర్మచారిణుల్. 25

చేటి : ( ప్రవేశించి ) జయము జయము దేవీ ! " అవదాతిక సంగీతశాల నుండి దొంగతనముగా కొన్ని నారచీరలెత్తుకొని పోయినది. ఇవిగో. ఇవి వాడని వల్కలములు. క్రొంగ్రొత్తవి. అవసరమైనచో మీరు వీని నుపయోగించుకొనవచ్చును. " అని నాటక రంగాధికారిణి రేవాదేవి ప్రణామ పూర్వకముగా విజ్ఞప్తి చేయుచున్నది.

రామ : భద్రా ! వాని నిటు తెమ్ము. ఈమె ఇంతకుముందే ధరించి సంతృప్తురాలైనది. ఇఁక నాకుఁ గావలసియున్నవి.

చేటి : ప్రభువులు గ్రహించండి. ( వల్కలములు రామున కందించి తొలఁగిపోవును. రాముఁడు వానిని ధరించును. )

లక్ష్మ : అన్నగా రనుగ్రహింపవలెను.

పూలమాలల వలువల భూషణాల
నాకు సాభా లొసంగి రన్నయ్యగారు ;
కాని యీనాఁడు నార లొక్కరె ధరింప
సాహసించితి రిది యేటి స్వార్థబుద్ధి ? 26

రామ : మైథిలీ ! మఱదిని మరలింపుము.

సీత : సౌమిత్రీ ! ఆగిపోవయ్యా !

లక్ష్మ : వదినే !

నీవొకర్తవె గురుపాదసేవఁ జేయఁ
గోరుచుంటివి! నాకు నాకోర్కెగలదు;
నీవు దక్షిణపాద సంసేవఁ జేయ
నేను వామపాదము భజియింతు భక్తి. 27

సీత : ఆర్యపుత్రులు అనుగ్రహించండి. సౌమిత్రి సంతప్త చిత్తుఁడైనాఁడు.

రామ : లక్ష్మణా! వినుము. ఈ వల్కలములు—

కవచములు తపోధర్మ సంగ్రామమునకు
నంకుశమ్ములు నియమ గజాధిపతికి
కళ్లియమ్ము లింద్రియ తురంగముల కెల్ల
సారథులు ధర్మరథ సుసంచారములకు. 28

నీవు వీనిని నిరభ్యంతరముగా ధరింపుము.

లక్ష్మ : మహాప్రసాదము (వల్కలములు గ్రహించి ధరించును)

రామ : మన వనగమన వృత్తాంతము నాలకించిన పురజనులతో రాజమార్గము కిటకిట లాడుచున్నది. మార్గము! మార్గము!

లక్ష్మ : ఆర్యా! ఉండుడు. నేను ముందు నడతును. త్రోవనిండు! త్రోవనిండు!

రామ : జానకీ! అవగుంఠనము తొలగింపుము.

సీత : ఆర్యపుత్రుల యాజ్ఞ (మేలిముసుఁగు తొలగించును.)

రామ : ఓహో పౌరులారా! ఆలకింపుఁడు. ఆలకింపుఁడు.

సజల నయనమ్ము లగు ముఖాబ్జముల నెత్తి
దేవి నీక్షింపుఁ డింక సందియము దక్కి
వ్యసన వనవాస పరిణయ యజ్ఞదశలఁ
దప్పుకాదు వరాంగనా దర్శనమ్ము. 29

కాంచుకీ : (ప్రవేశించి) వలదు వలదు. రాజకుమారా ! మీరు పోవలదు. ఇడుగో మహారాజు—

లక్ష్మణుని గూడి యర్ధాంగలక్ష్మితోడ
తా మరణ్యాల కేగు వృత్తాంత మెఱిఁగి
వేగ నరుదెంచు లేచి, పరాగ మలిన
కృశ శరీరమ్ము దాల్చి వన్యేభమట్లు. 30

లక్ష్మ : ఆర్యా !
నారచీరలు గట్టి కానల వసింప
నేగువారలఁ జూచుట కేమిగలదు !

రామ :
చనెడు సమయాన మనదు శీర్షమ్ము లేని
గానరాకుండు గాక ! భూకాంతునకును. 31

*(అందరు నిష్క్రమింతురు.)*

---

# ద్వితీయాంకము

[కాంచుకీయుఁడు ప్రవేశించును.]

కాంచుకీ : ఓహోహో! ప్రతీహారులారా! మీ రందఱు మీ మీ స్థానములయం దప్రమత్తులై యుందురుగాక!

ప్రతీహారి : (ప్రవేశించి) ఆర్యా! ఏమిటి విశేషము?

కాంచుకీ : సత్యవచన సంరక్షణపరుఁడైన మన మహారాజు వనగమనోన్ముఖుడైన శ్రీరామచంద్రుని మరల్పలేక పుత్రవిరహ శోకాగ్ని సందగ్ధ హృదయుఁడై యున్మత్తునివోలె నేదేదో ప్రలాపించుచు సముద్ర గృహకములో శయ్యాగతుఁడై యున్నాడు.

ప్రళయమునం జలించెడు సుపర్వగిరీంద్రము భంగి, భీషణో
ద్భులుదిగ్ద్రావి శోషణముబొందు మహోదధిమాడ్కి, మిక్కిలిన్
వెలవెలబాటుతోడ ప్రతిబింబడు భాస్కరమండలం బటుల్
కలవరమందెడిన్ ధరణికాంతుఁ డనంత శుచా కృశాంగుఁడై. 1

ప్రతీ : అయ్యయ్యో! మహారాజుగారి కెంతటి దురవస్థ ప్రాప్తించినది!

కాంచుకీ : ప్రతీహారీ! ఇఁక నీవు వెళ్లుము.

ప్రతీ : చిత్తము. (నిష్క్రమించును.)

కాంచుకీ : (నలువైపులఁ బరికించుచు) ఔరా! శ్రీరామనిర్గమన దినమునుండి యయోధ్య సర్వశూన్యమైనట్లు కానుపించుచున్నది. ఏలయన—

ముట్టవు మేతలన్ ద్విరదముల్, సకిలింతలు మాని కంట నీ
ర్వెట్టు తురంగముల్, జనులు పిన్నలు పెద్దలు తిండితిప్పలున్
బట్టక దీనులై మనసు బట్టక శ్రీ రఘురామ లక్ష్మణుల్
పట్టిన మార్గముల్ గనుచు బావురుమందు రుదశ్రునేత్రులై. 2

ఇప్పుడు నేనుగూడ మహారాజు సమీపమునకుఁ బోయెదను. (పరిక్రమించి చూచి) ఇదుగో మహారాజు! దుర్భర పుత్రవిరహ దుఃఖమున నల్లాడుచు నెట్లెట్లో చిత్తములు చిక్కబట్టుకొని తన్ను సేవించుచున్న కౌసల్యా సుమిత్రల పరిచర్య లందుకొనుచున్నాడు. ఈ పరిస్థితి మిక్కిలి బాధాకరము.

శోచనీయమ్ముగా లేచి లేచి పడుచు
శోకమున పెద్ద పెద్దగా కేక లిడుచు
నసుఁగు తనయుఁడు దండకావనికి జనిన
దిక్కె గనుచుండె ఱేఁడు తదేక దృష్టి. 3

*(నిష్క్రమించును.)*

—: ఇది మిశ్రవిష్కంభకము :—

*(యథానిర్దిష్టముగ దశరథ మహారాజు కౌసల్యా సుమిత్రలతోఁ బ్రవేశించును.)*

దశరథుఁడు :

హా! కుమార! శ్రీరామ! లోకాభిరామ!
లక్ష్మణా! సర్వ లక్షణ లక్షితాంగ!
అమ్మ వైదేహి! పతిపదధ్యాన నిరత!
అకట! బిడ్డలారా! కాన కరిగినార! 4

ఔరా! చిత్రము! భ్రాతృభక్తిలోఁబడి పితృభక్తినే పరిత్యజించిన లక్ష్మణకుమారునిఁ జూడ మనస్సు తహతహ లాడుచున్నదే! వధూమణీ! వైదేహీ!

సరియె రాముఁడు విడనాడి చనియె నన్ను!
అవును సౌమిత్రి త్రోసిరా జనియె నన్ను!
అమ్మ! సీతమ్మ! నీవును నట్లె విడువ
నింద పాలైన నా కేది యిందు దిక్కు? 5

నాయనా రామా! వత్సా లక్ష్మణా! వధూ వైదేహీ! నాతో నాల్గు మాటలు మాటాడరా నాయనలారా! అయ్యో! యిక్కడ నంతయు శూన్యము! నాతో నెవ్వరు మాటలాడరు! నాయనా! కౌసల్యానందనా! నీ వెక్కడ నున్నావురా తండ్రీ!

సత్యవాక్పాలకా! విమత్సర! కుమార!
రమ్ము! గురుజన సేవాపరాయణా! జ
గత్ప్రియా! జితక్రోధ! ఒక్కపరి రమ్ము!
నన్ను దనుపుము నీ భాషణామృతమున. 6

ఏ! ఏడీ నా రాముడు! సర్వజన హృదయనయనాభిరాముఁడైన నా రాముఁ డేడీ! నాపై నాతనికిఁ గల గురుభావ మేదీ! ఏదీ శోకార్తుల యెడల నాతని జాలిగుండె! అగణిత రాజైశ్వర్యము లను తృణప్రాయముగా నెంచిన నా రాముఁ డెక్కడ! తండ్రీ! రామా! వృద్ధజనకుని నన్ను వీడిపోవలసినంత ధర్మకార్య మేమి దాపురించినదోయీ! అయ్యో! ఎంత కష్టము! అక్కటా!

చనియె రాముఁడు భానుఁ డేగిన విధాన
దినము పోలిక సౌమిత్రి యనుసరించె
సూర్యదివసావసానాన చూడరాక
జానకి యదృశ్యమైనది ఛాయవోలె! 7

(పైకిఁ జూచి) ఓ దుర్విధీ!

అకట! అనపత్యుఁ డేల కానైతినేను?
అన్య నృపపుత్రుఁ డేల కాఁ డయ్యె రాము?
డే యరణ్యంబు నందో కైకేయి యేల
వ్యాఘ్రి కాలేదో? యిటు చేయనైతివేల? 8

కౌసల్య: (విలపించుచు) మహారాజా! అత్యంత సంతప్త హృదయులై దుఃఖోద్రేకమున మై మఱచి పోవుచున్నారు. గడువుతీఱినంతనే సీతారామలక్ష్మణులు మీకు కన్నులవిందు చేయగలరు.

దశర : ఓహో నీ వెవరు ?

కౌసల్య : నే నొక కఠినహృదయుని గన్నతల్లిని.

దశర : ఏమేమీ ! నీవు సర్వజన హృదయ నయనాభిరాముఁ డైన శ్రీరాముని కన్నతల్లివి కౌసల్యవా !

కౌసల్య : అవును మహారాజా ! ఆ మందభాగ్యను నేనే !

దశర : కోసల రాజపుత్రీ ! శ్రీరామచంద్రుని గర్భమున ధరింపఁ గలిగిన నీవు నిజముగా సర్వోత్తమురాలవు. మఱి నేనో—

దుస్సహాంబులైన దుఃఖాగ్నికీలల
గుండె భగ్గు మనుచు మండుచుండె ;
విషయలాలసుండ వృద్ధుండ నీ బాధ
మోయలేను ! తీసివేయలేను ! 9

( సుమిత్రను విలోకించి ) ఈమె యెవరు ?

కౌసల్య : మహారాజా ! ఈమె మన కుమార లక్ష్మణుని—

( ఆర్ద్రోక్తిలో )

దశర : ( చివాలున లేచి ) ఏడీ ! ఏడీ ! లక్ష్మణుఁడు ! ఎక్కడ నున్నాఁడు ? నా కన్నులకు కన్పింపఁ డేమి ! అయ్యో ! కష్టము. కష్టము.

*(రాణు లిరువురు ససంభ్రమముగా లేచి మహారాజును బట్టుకొందురు.)*

కౌసల్య : మహారాజా ! కుమార లక్ష్మణుని జనని సుమిత్ర యని చెప్పఁబోయితిని.

దశర : సుమిత్రా !

పడతి ! నీ పుత్త్రుఁడే సుపుత్త్రుఁడు ; మఱెందు
కందువా ! కానలందు రాత్రిందివాలు
నీడవలె వీడకుండ వెన్నాడుచుండె
రఘుకులాంబుధిచంద్రు శ్రీరామచంద్రు. 10

కాంచుకి : ( ప్రవేశించి ) జయము జయము మహారాజా ! ఆర్య సుమంత్రుఁ డరుదెంచినాడు.

దశర : ( సంభ్రమముతో లేచి సంతోషముతో ) రామునితోడనా ?

కాంచుకి : కాదు ప్రభూ ! రథముతో !

దశర : ఏమి యేమిటీ ! రామునితోడ కాదా? రథముతో మాత్రమేనా!

( మూర్ఛిల్లును. )

కౌసల్య :<br>సుమిత్ర : } మహారాజా ! ఊరడిల్లుఁడు. ఊరడిల్లుఁడు.

(సమాశ్వాసింతురు.)

కాంచుకి : అయ్యో ! ఎంతకష్టము ! విధి యనతిక్రమణీయము. ఇట్టి మహాత్ములుకూడ నీదృశదురవస్థకు పాల్పడవలసివచ్చినది. మహారాజా ! ఊరడిల్లుఁడు. ఊరడిల్లుఁడు.

దశర : ( కొంచెము తేరుకొని ) బాలాకీ ! సుమంత్రుఁ డొక్కఁడే వచ్చినాఁ డందువా ?

కాంచుకి : చిత్తము మహారాజా !

దశర : అక్కటా ! ఇఁక నేమున్నది !

శూన్యమై యిటు వచ్చినచో రథమ్ము<br>
శిథిలమైనట్లె మన్మనోరథముకూడ<br>
ఈ రథము మృత్యుదేవతా ప్రేరితమయి<br>
వచ్చినట్లె యీ దశరథేశ్వరుని కొఱకు. 11

సుమంతుని శీఘ్రముగాఁ బ్రవేశపెట్టుము.

కాంచుకి : చిత్తము. ( నిష్క్రమించును. )

దశర : ఆహా ! ఆహా !

కాననములోని కొలకుల పైన వీచు
తెమ్మెరలు చేసికొన్న పుణ్యమ్మదెంతొ!
అచ్చట చరించు రాముమే నల్లనల్ల
సంస్పృశించును పారవశ్యమ్ము గదుర. 12

(సుమంత్రుఁడు ప్రవేశించును.)

సుమం: (నలువైపులఁ గలయఁజూచి శోకముతో)
అకట! పరిజనుల్ స్వీయకార్యాలు విడిచి
రామచంద్రునిపైగల ప్రేమ కతన
దుఃఖ ముప్పొంగఁ గన్నీరుఁ దుడిచికొనుచు
బిట్టు రోదించు పార్థివుఁ దిట్టుచుండ్రి. 13
(సమీపించి) జయము జయము మహారాజులకు!

దశర: సోదరా! సుమంత్రా!
ఏడి నా పెద్ద కొడుకు? ................
కాదు కాదు! నేను యుక్తముగా పలుకలేదు.
ఏడి నీ పెద్ద కొడుకు రాఁడేమి రాముఁ?
డేది వైదేహి? లక్ష్మణుండెచ్చటయ్యె?
ఏమనిరి? యింతమంది నిట్లేడిపించి
చావనున్న యీ పాపిష్ఠి జనకుఁ గూర్చి. 14

సుమం: మహారాజా! ఇట్టి యమంగళవచనము లాడవలదు. అచిర కాలముననే మీరు వారి నాలోకింపగలరు.

దశర: నిజమే. నే నయుక్త వచనము లాడితిని. ఇది తపస్వి జనులకుఁ దగిన ప్రశ్నము కాదు. ఇఁక నిప్పుడు చెప్పుము. తాపసుల తపస్సులు నిర్విఘ్నముగా నెరవేరుచున్నవా? అరణ్యభూములలో స్వేచ్ఛగా విహరించుచున్న విదేహ రాజపుత్రికి విచారము లేదు గదా!

సుమిత్ర : సుమంత్రా ! ప్రాయమునఁ జిన్నయయ్యును గుణగణములఁ బెద్దయు, నానావిధ వల్కలాలంకృత తనూలతయు, భర్తృ సహ ధర్మచారిణియునైన జానకి మాకును మహారాజునకును నేమైన సందేశ మంపినదా ?

సుమం : వారందఱును మహారాజును—

దశర : కాదు కాదు. నాకు శ్రవణపర్వముగా, హృదయము చల్ల నగునట్లుగా వేరువేర వినిపింపుము.

సుమం : ప్రభువుల చిత్తము. ఆయుష్మంతుఁడు రాముడు—

దశర : ఏమంటివి ! రాముఁడా ! అవును – రాముఁడు ! నామశ్రవణ మాత్రముననే నారాముని స్పృశించినట్లున్నది. తరువాత ?

సుమం : చిరంజీవి లక్ష్మణుఁడు—

దశర : అవును. లక్ష్మణుఁడు. తరువాత ?

సుమం : ఆయుష్మతి విదేహ రాజపుత్రి.

దశర : ఆఁ వైదేహియా ! సరేకాని రాముఁడు, లక్ష్మణుఁడు, వైదేహి ఈ వరుస యక్రమము.

సుమం : ఐన సక్రమ మేది ?

దశర : " రాముఁడు, వైదేహి, లక్ష్మణుఁడు " ఇట్లనవలయును. ఏమందువా—

జానకీదేవి రామలక్ష్మణుల నడుమఁ

జక్కగా నిల్వవలయు నిచ్చటను గూడ ;

భీకరములు విపత్తుల కాకరములు

గహనములు ; బిడ్డ కెపుడు రక్షణము వలయు. 15

సుమం : మహారాజు నాజ్ఞ. ఆయుష్మంతుఁడు రాముఁడు—

దశర : అవును. రాముఁడు—

సుమం : అయుష్మతి వైదేహి.

దశర : ఆఁ. వైదేహి——

సుమం : చిరంజీవి లక్ష్మణుఁడు.

దశర : ఆఁ. లక్ష్మణుఁడు–రామా ! వైదేహీ ! లక్ష్మణా ! బిడ్డలారా ! రండు. నన్ను కౌఁగలించుకొనుఁడు.

> చాలు నొకమాటు రాము స్పర్శనము నాకు
> చాలు నొకమాటు రాము దర్శనము నాకు
> వెండి జీవింతు నంచు భావింతు నేను
> మృతుఁ డమృతసేచనమ్మున బ్రతికినట్లు. 16

సుమం : శృంగిబేరపురప్రాంతమున రథమును డిగ్గి యయోధ్యాభిముఖముగా నిలువఁబడి వారు ముప్వురును మహారాజునకు శిరసా ప్రణామములు కావించి విన్నవింపనెంచిరి. కాని——

> చాలసే పేదా లోలోన సంస్మరించి
> చెప్పుటకుఁ బెదవులు గదల్చియును గూడ
> బాష్ప గాద్గద్యమున మాట పైకి రాక
> యేమియుం బల్కకయె వని కేగినారు. 17

దశర : అక్కటా ! ఏ సందేశము నందింపకయే వా రరణ్యముల కరిగినారా ! ( గాఢముగా మూర్ఛిల్లును. )

సుమం : ( ససంభ్రమముగా ) బాలాకీ ! మహారాజు మిక్కిలి ప్రమాద భరితమైన దశలో నున్నారని మంత్రులకు మనవిచేయుము.

కాంచుకీ : చిత్తము. ( నిష్క్రమించును. )

కౌసల్య : }
సుమిత్ర : } మహారాజా ! ఊరడిల్లుఁడు. ఊరడిల్లుఁడు.

దశర : ( కొంచెము తేరుకొని ) దేవీ ! కోసలరాజపుత్రీ !
గట్టిగా నా శరీరమ్ము పట్టుకొమ్ము !
కన్నులుండియు నా కీవు కానరావు ;
రాముఁ జేరంగఁ బోయిన నామనస్సు
మరల నా సమీపమునకు మరలిరాదు. 18

కుమారా ! శ్రీరామా ! నేనిట్లు సంతతము చింతించుచున్నాను.
నిన్నభిషిక్తుఁజేసి ధరణీస్థలికిన్, ప్రజలెల్ల తృప్తులై
సన్నరనాథుఁడంచు నుతి సల్పగ, తమ్ముల నినువోలె స
త్ప్యన్నతరీతి గౌరవముతోఁ గనఁబల్కి, తపోవనాలకే
నెప్పుడు పోదునా యని తపించితి-మార్చెను కైక సర్వమున్. 19

సుమంత్రా ! కైకేయితో నిట్లనుము.
అరిగె రామభద్రుఁడు " శుభమస్తు " నీకు
పోవుచున్నవి నామొండి జీవములును ;
పిలువ నంపింపు మింక నీ ప్రియకుమారు,
పక్వ మగుగాక ! నీ పాపఫలము కైక ! 20

సుమం : మహారాజుల యాజ్ఞ.

దశర : ( పైకిఁ జూచుచు ) ఓహో ! శ్రీరామ కథా శ్రవణ దండహ్యా మానమానసుఁడనైన నన్నోదార్చుటకు మా పితృ దేవత లరుదెంచినారు, ఎవరక్కడ ?

కాంచుకీ : ( ప్రవేశించి ) మహారాజులకు జయము.

దశర : శుద్ధోదకము.

కాంచుకీ : చిత్తము. ( మంచినీటితో ప్రవేశించి ) జయము జయము మహారాజులకు ! ఇదిగో శుద్ధోదకము.

దశర : ( ఆచమించి యాలోచించి )

ఈతఁడు దిలీపనృపుఁడు దేవేంద్రమిత్రుఁ -
డితఁడు రఘువిభుం - డితఁడు మత్పిత యజుండు -
ఏల యరుదెంచినారిటు ? లేను మిమ్ము
పేరుచున్నాడ ! మీతో వసింతు నచట. 21

రామా ! వైదేహీ ! సౌమిత్రీ ! నేనిట నుండి పితృదేవతల సాన్నిధ్యమున కేగుచున్నాను. ఓ పితృదేవతలారా ! ఇదే వచ్చుచున్నాను. ( పడిపోవును. )

( కాంచుకీయుఁడు యవనికాచ్ఛాదనము చేయును. )

అందఱు : అయ్యో ! అయ్యో ! మహారాజా ! మహారాజా !

( అందరు నిష్క్రమింతురు. )

---

# తృతీయాంకము

[సుధాకారుఁడు ప్రవేశించును.]

సుధా : ( సమ్మార్జనాదికములుచేసి ) మంచిది! ఆర్యసంభవకుఁడాజ్ఞాపించిన పని యంతయుఁ బూర్తిగావించితిని. ఇప్పుడొక్కింత సేపు నిద్రింతును. ( నిద్రపోవును. )

భటుడు : ( ప్రవేశించి సుధాకారుని సమీపించి ) ఏమిరా! దాసీపుత్రా! నీవు నీపని చేయకుంటివేల? (కొట్టును )

సుధా : ( మేల్కాంచుచు ) కొట్టుము. కొట్టుము.

భటుడు : కొట్టిన నేమి చేసెదవు?

సుధా : ఏమి చేయుదును! దురదృష్టవంతుఁడనగు నాకు కార్తవీర్యుని వలె సహస్ర బాహువులు లేవుగదా!

భటుడు : ఉన్నచో నేమి చేయుదువు?

సుధా : నిన్ను గొంతు పిసికి చంపి వేయుదును.

భటుడు : రమ్ము దాసీపుత్రా! నిన్ను ప్రాణముతో విడువను.

( మరల కొట్టును. )

సుధా : ( ఏడ్చుచు ) అయ్యో! ఇంతకు నా యపరాధ మేమి?

భటుడు : లేదురా! అపరాధమేలేదు. రాజకుమారుఁడైన రాముని రాజ్యభంగముచే సంభవించిన సంతాపమున స్వర్గస్థుఁడైన దశరథేశ్వరుని ప్రతిమా మూర్తిని ప్రతిమా గృహములో దర్శించుటకై కౌసల్యాద్యంతః పురాంగన లరుదెంతురని చెప్పలేదా? అందులకై నీ వేమి చేసితివి?

సుధా : మీరు చూడవచ్చును. ప్రథమమున భవనాంత ర్భాగమునందలి పావురాగూండ్లను దొలగించితిని. సున్నముగొట్టిన గోడలను చందనహస్త ముద్రాంకితములు గావించితిని. ద్వారములకు పుష్ప మాల్యము లలంకరించితిని. ఇసుకదిబ్బలు సరిజేసితిని. నే నేమి చేయలేదు ?

భటుడు : అట్లైన నీవు నిర్భయముగా బోవచ్చును. ఇంతలో నేను సర్వము సంసిద్ధమైనట్లు సచివులకు విన్నవింతును.

*( నిష్క్రమింతురు. )*

—: ఇది ప్రవేశకము :—

*( రథారూఢులై భరతుఁడు సూతుఁడు ప్రవేశింతురు. )*

భర : ( సావేగముగా ) సూతా ! బహుకాలము మాతుల గృహమున నుండుటవలన నిచ్చటి విశేషములేమియు నాకు తెలియకున్నవి. మహారాజస్వస్థశరీరుఁడై యున్నాఁడని వింటిని. నీవు చెప్పుము.

భర : జనకుని వ్యాధి వాకొనుము;

సూతుఁడు : అసాధ్యము మానసికార్తి,

భర : దానికేమనిరి భిషగ్వరుల్ ?

సూతుఁడు : తెలియరైరి చికిత్సను;

భర : శయ్యా ?

సూతుఁడు : భూమి,

భర : భోజనము ?

సూతుఁడు : ఉపవాసము,

భర : ఏమిగతి ?

సూతుఁడు : సర్వవిభుండగు దైవమే ;

భర :

సరే! మన యరదమ్ము ద్రోలు మిక
మామక చిత్తము సంచలించెడున్.

సూతుఁడు : ఆయుష్మంతుని యాజ్ఞ. (రథము దోలును.)

భర : (రథవేగమును నిరూపించుచు) ఆహా! రథ మెంత శీఘ్రముగాఁ బోవుచున్నది!

భూమిరుహాలు పర్విలిడి పోయెడి, ధాత్రి ప్రసన్నదీక్రియన్
నేమిఁల దాకు, నాకుల గణింపగరా దెడమింత, నిశ్చలం
బౌమెయిఁ దోచు చక్రవలయంబు, తురంగఁఖురోద్ధమౌ రజ
స్తోమముగూడ వెన్కబడు చున్నది ముందునకేగజాలమిన్. 2

సూతుఁడు: ఆయుష్మంతుఁడా! ఈవృక్షపంక్తులను వీక్షింపగా నయోధ్య వలెనే తోచుచున్నది.

భర : ఆహా! స్వబంధు సంపర్శనమునకై నా హృదయము తహ తహ లాడుచున్నది. ఇప్పటికిగూడ——

ప్రాలినట్లేయుండె మౌళి మజ్జనకుడౌ
దశరథాధీశు పాదాల మీద
స్నేహాన కౌగిట జేర్చినట్లేయుండె
ననులేవనెత్తి మా నాన్నగారు
నాచుట్టు మూగి కొన్నట్లుండె ప్రియసహో
దరులు నిండారు సంబరముతోడ
ముంచెత్తి నట్లుండె మోదాశ్రువులతోడ
కన్నతల్లులు గుండె కరగిపోవ
'నెంతవాడయ్యె' 'నెంత యెత్తెదిగె' నౌర!
యంచు పరిజనుల్ పల్కుచున్నట్టె యుండె
సారెకు మదీయ వేషభాషలను జూచి
యల్ల సౌమిత్రి నవ్వుకొన్నట్లెయుండె. 3

సూతుఁడు : (స్వగతము) అక్కటా! ఎంతకష్టము! మహా రాజ మరణోదంత మెఱుంగని కుమారుఁడంతులేని యడియాసలతో నయోధ్యానగరము ప్రవేశించుచున్నాఁడు. నే నెఱిఁగియున్నను తెలుపరాదు. ఏమన

కన్నతండ్రి మృతిని గన్న వృత్తాంతమ్ము
కన్నతల్లి రాజ్యకాంక్ష మఱియు
నన్నగారి కాననావాస మను మూడు
చెడ్డవార్త లెవఁడు చెప్పగలఁడు? 4

భటుఁడు : (ప్రవేశించి) జయము జయము రాజకుమారా!

భర : భద్రా! శత్రుఘ్నుఁడు వచ్చెనా?

భటుఁడు : ఆయన సమీపమునకే వచ్చియుందురు. గురుదేవులు మిమ్మిట్లాదేశించుచున్నారు.

భర : ఏమని? ఏమని?

భటుఁడు : "కృత్తికా నక్షత్రమింకను నొక ఘడియ పర్యంతమున్నది. కనుక దుర్ముహూర్తము గడచి రోహిణి ప్రవేశించినంతనే మీరు పుర ప్రవేశము చేయవచ్చును." అని.

భర : మంచిది. నే నెన్నఁడును గురువచనాతిక్రమణము గావింపలేదు. అట్లే కానిమ్ము. ఇక నీవు పోవచ్చును. (నిష్క్రమించును.)

భటుఁడు : ప్రభువుల యాజ్ఞ.

భర : ఇప్పు డెచ్చట విశ్రాంతి దీసికొందును! ఇదిగో ఈ వృక్షవాటికా మధ్యమున గాన్పించుచున్న దేవగృహములో ముహూర్తమాత్రము విశ్రమింతును. ఇందుచే దైవారాధనము, విశ్రాంతి రెండును గలసి వచ్చును. ఇంతేగాక నగరోపాంతమున గొంచెము సేపు కూర్చుండి మఱి పురప్రవేశము చేయవలెనని పెద్దల యనుశాసనము. సూతా! అరదము నాపుము.

సూతుఁడు : ఆయుష్మంతుని యాజ్ఞ. ( రథము నాపును. )

భర : ( రథమునుండి దిగి ) సూతా ! కొంచెము సేపు గుఱ్ఱముల విశ్రమింపఁ జేయుము.

సూతుఁడు : చిత్తము. ( నిష్క్రమించును. )

భర : ( కొంచెము ముందునకు నడచి పరికించుచు ) పుష్పజాలాలంకారములతో బలులు చక్కఁగా నెరవేర్పబడినవి. కుడ్యములు చందన హస్త ముద్రాంకితములైనవి. ద్వారములు పుష్పమాలాలంకృతములై యున్నవి. సికతాతలములు సరిచేయబడినవి. ఇదంతయు నేదైన పండుగ విశేషమా ! కాక ప్రతి నిత్యముచేయు పూజా విధానమా ! ఇదే దేవాలయమైయుండును ! ఇచ్చట ధ్వజాది చిహ్నము లేవియు గాన్పించుట లేదే ! కానిమ్ము. లోనికేగి తెలిసికొందునుగాక ! ( ప్రవేశించి చూచి ) ఆహా ! ఈ పాషాణముల మీది పనితనమేమి ! ఆహా ! ఈయాకారముల భావప్రకటన మెంత బాగున్నది ! ఈ ప్రతిమలు దైవోద్దేశముతో మలచబడినను మనుష్యులను విశ్వాసము గలిగించుచున్నవి. ఈ నలుగురు దేవతా మూర్తు లెవరైయుందురో ! కానిమ్ము. ఎవరైననేమి ! నామన మానందముతో నుప్పొంగుచున్నది.

> దేవతామూర్తులే యను భావమూని
> భక్తిమెయి వందనముసేత యుక్తమగును;
> ఇదియు నొక విధమగు మంత్రహీనదేవ
> తా సమర్చనమందు వందనమె సుమ్ము. 5

దేవకులికుఁడు : ( ప్రవేశించి ) ఔరా ! నిత్యపూజ నిర్వర్తించి నే నిప్పుడే గదా యింటికిఁబోయితిని. ఇంతలో నీ ప్రతిమా గృహమును బ్రవేశించిన యీతఁడెవ్వరో ? ఈయన యాకారము కొంచె మించుమించుగా నీ ప్రతిమలకు సరిపోలుచున్నది. కానిమ్ము. లోనికిఁబోయి తెలిసికొందును. ( లోనికి వచ్చును. )

ఖర : నమస్కారము.

దేవ : వలదు. వలదు. నమస్కరించుట తగదు.

ఖర : ఇదేమయ్యా !

ఇట్లు నన్ను నివారింతు వేలనయ్య ?
నేను చేసిన దోషమేదేని గలదె ?
లేక వ్రతపాలనమ్మ ? ప్రత్యేకమైన
ప్రాకృతాచారమా ? వచింపంగదయ్య ! 6

దేవ : ఈ కారణములతో మిమ్ము నేను నిషేధింపలేదు. దైవత బుద్ధితోఁ జేయబడిన బ్రాహ్మణ ప్రణామమును బ్రతిషేధించు చున్నాను. ఇవి క్షత్రియుల ప్రతిమలు.

ఖర . ఓహో ! క్షత్రియుల ప్రతిమలా ! ఏ వంశక్షత్రియులో ?

దేవ : ఇక్ష్వాకులు.

ఖర : ( సహర్షముగా) ఇక్ష్వాకులా ! అయోధ్యాధీశ్వరులా !

అసురుల నోర్చువేళ దివిజాళికి సాయముశేయు యోధులై
స్వసుకృత సంపదన్ సపరివారముగా దివినుండి ధన్యులై
యసదృశ శక్తిధాత్రి చతురబ్ధి పరీవృతమేలు దక్షులై
యొసగెడువారు వీరు–స్పృశియింపదు మృత్యువు వీరి స్వేచ్ఛమై.

అహో ! యాదృచ్ఛికముగా నాకీ మహాభాగ్యము లభించినది. ఐన ముందు చెప్పుము. ఇందులో వీరెవ్వరు ?

దేవ : ఈయన సమస్తరత్న రాజీవిరాజితమగు విశ్వజిద్యజ్ఞమును జేసిన ప్రజ్వలిత ధర్మప్రదీపుఁడు దిలీపుఁడు.

ఖర : ఆ ధర్మమూర్తికి నమస్కారము. తరువాత చెప్పుము. ఈయన యెవరు ?

దేవ : ఈయన సర్వకాల సర్వావస్థలయందును బ్రాహ్మణ సహస్ర ప్రశస్త పుణ్యాహ సంశోభితుఁడైన రఘు మహారాజు.

భర : ఆహా ! మృత్యు వెంత బలవంతము ! ఇట్టి మహిమాన్వితునిగూడ లోబరచుకొనినది. బ్రాహ్మణాశీర్వాద పరివర్థిత రాజ్యశ్రీయగు రఘుమహారాజునకు నమస్కారము చెప్పుము. ఈ మూడవ ప్రతిమ యెవరిది ?

దేవ : ప్రియావియోగ నిర్వేదముచే రాజ్యభారమును బరిత్య జించిన యజమహారాజీయన ! నిత్యావభృథ స్నాన పవిత్రగాత్రుఁడు.

భర : శ్లాఘనీయ ప్రణయుఁడైన యజభూపాలునకు బ్రణామములు (దశరథుని ప్రతిమ నవలోకించి వ్యాకులుడై) శ్రద్ధాగౌరవములతో నిండిన నామనస్సునకు చక్కగా జ్ఞాపకముండుటలేదు. మరల చెప్పుము. ఈ రాజెవ్వరు ?

దేవ : ఈయన దిలీపుఁడు.

భర : అవును. మానాన్నగారి ప్రపితామహుఁడు. తరువాత ?

దేవ : ఈయన రఘుమహారాజు.

భర : అవును. మానాన్నగారి పితామహుఁడు. తరువాత ?

దేవ : ఈయన యజమహారాజు.

భర : అవును. మాతండ్రిగారి తండ్రిగారు. ఏదేదీ మరలచెప్పుము.

దేవ : ఈయన దిలీపుఁడు. ఈయన రఘువు. ఈయన యజుఁడు.

భర : నిన్ను నేనొక్కవిషయము నడుగగోరుదును ఇట బ్రతికియున్న వారి ప్రతిమలు గూడ స్థాపింతురా ?

దేవ : లేదు. చనిపోయినవారివి మాత్రమే.

భర : ఐన నిఁక నేను సెలవు దీసికొందును.

దేవ : కొంచెము ముండుఁడు.

ప్రాజ్య సామ్రాజ్యమును నిజప్రాణములను
భార్య శుల్కార్థమై సమర్పణ మొనర్చి
స్వర్గతుండైన దశరథేశ్వరుని ప్రతిమ
నరసి తదుదంత మడుగవేలా ! కుమార ! 8

భర : హా ! తండ్రీ ! ( మూర్ఛితుఁడై మఱల తేరుకొని )

అయ్యో హృదయమా ! శంకించినట్లె యయ్యె
జనకు నిధనమ్ము వినుము - నిశ్చలతగనుము -
నిక్కముగ మత్ప్రసక్తి యీ నీచకుల్క-
శబ్దగతమైన నింక నా జన్మ మేల ? 9

ఆర్యా !

దేవ : "ఆర్యా!" అను సంబోధన మిక్ష్వాకు కులాచారము. కుమారా ! నీవు కైకేయీ నందనుఁడవైన భరతుఁడవా ?

భర : అవునవును. నేను దశరథనందనుఁడను. కైకేయీ నందనుఁడను గాను.

దేవ : ఇంక నేను సెలవు దీసికొందును.

భర : ఆగుము. నాకు మిగిలిన కథ వినిపింపుము.

దేవ : ఏమిగతి ! వినుఁడు. దశరథేశ్వరుఁడు స్వర్గస్థుఁడైనాఁడు. కాని సీతాలక్ష్మణ సమేతముగా శ్రీరాముఁడరణ్యముల కేల పోయెనో నాకు తెలియదు.

భర : ఏమేమీ ! అన్నగా రరణ్యముల కేగిరా ! ( మఱింత మూర్ఛాక్రాంతుఁ డగును. )

దేవ : కుమారా ! ఊరడిల్లుఁడు. ఊరడిల్లుఁడు.

భర : (తెప్పరిల్లి)

తండ్రిచే నన్నచేఁ బరిత్యక్త మగుట
నడవిగానైన యీ యయోధ్యాపురమున
కరుగుచున్నాఁడ ; జలహీన మైన నదికిఁ
బరువు లెత్తు పిపాసార్తు పగిది నేను. 10

ఆర్యా ! మఱింత స్పష్టముగా విన్నగాని నా హృదయము కుదుటబడదు. కనుక జరిగిన వృత్తాంతము నామూలాగ్రముగా వివరింపుము.

దేవ : వినుఁడు. దశరథమహారాజుగారు శ్రీరామచంద్రునకుఁ బట్టాభి షేకము జేయబోవు సమయమున మీ జనని యడ్డువచ్చి యిట్లనినది.

భర : అగుము. అవగతమైనది –

శుల్కకథానుసారముగ సూనుమహీశు నొనర్ప జేనితోఁ
బల్కెను కైక; కానలకుఁ బంపెను నగ్రజు మంచిమాటలన్;
వల్కలయుక్తు నార్యుగని వాసెను ప్రాణము తండ్రి; యింక వే
నాల్కలతో, ననుంగని జనంబులు ఛీయను టొక్క చే గదా ! 11

*( మూర్ఛాక్రాంతుఁ డగును. )*

*( నేపథ్యములో )*

అయ్యలారా ! తొలగుడు. తొలగుడు.

దేవ : (విలోకించి) అహో !

అనుఁగు తనయుఁడు మూర్ఛలో మునిగినాఁడు
తగినవేళకె రాజమాతలును వచ్చి
నారు; మృగతృష్ణలో జలాంజలియె కాదె
జనని చల్లని హస్తసంస్పర్శనమ్ము. 12

*( సుమంత్ర సహితముగా రాణులు ప్రవేశింతురు. )*

సుమం : అమ్మా ! ఇటు. ఇటు.

అమ్మ ! కనుఁ డిదె రాజహర్మ్యమును మించు
మన మహీవల్లభుల ప్రతిమాగృహంబు !
పథికు లెల్ల ప్రతీహారి బాధలేక
స్వేచ్ఛమై జొతలిడక దర్శించుచుండ్రు. 13

(ప్రవేశించి చూచి) వలదు. వలదు. అమ్మా ! అగుఁడాగుఁడు. ప్రవేశింపకుఁడు.

యౌవనంబున పార్థివు నట్టులున్న
యొక్క జనుఁ డెవ్వఁడో పడియుండె నిచట !

దేవ : ఎవ్వఁడో పరుఁ డని సంశయింపనేల ?
అరసికొనుఁడు చిరంజీవి భరతుఁ డితఁడు. 14

(నిష్క్రమింపుదు.)

రాణులు : (సత్వరముగాసమీపించి) హా ! కుమారా ! భరతా !

భర : (కొంచెము తేరుకొని) ఆర్యా !

సుమం : జయతు మహా - (అర్ధోక్తిలో సవిషాదముగా) ఆహా ! ఎంతటి స్వరసాదృశ్యము ! ప్రతిమాగతుఁడైన మహారాజే పలుకుచున్నాఁ డనిపించుచున్నది.

భర : సరే. ఇప్పుడు మాయమ్మల యవస్థ యెట్లున్నది ?

రాణులు : నాయనా ! మా యవస్థ యిట్లున్నది. (మేలిముసుగులు తొలగింతురు.)

సుమం : అమ్మా ! మీరు దుఃఖోద్వేగము నిగ్రహింపుఁడు.

భర : (సుమంత్రుని జూచి) సముదాచార సంబద్ధమైన మీ సన్నిహిత సంబంధమే చెప్పక చెప్పుచున్నది. ఆర్యా ! మీరు సుమంత్ర మహామాత్యులేకదా !

సుమం : అవును కుమారా ! సుమంత్రుఁడనే.

ఇంతకంటె మొండిఘటం బదెందుఁ గలదు ?
ఇంతకంటె కృతఘ్నత యేమి గలదు ?
అమ్మహారాజు స్వర్గతుండైనఁ గూడ
బ్రతికియున్నాఁడ శూన్యమౌ రథము దోల. 15

భర : హా ! తండ్రీ ! (లేచుచు) తండ్రీ ! మా తల్లులకు నమస్కరింప వలయును. క్రమము నుపదేశింపుము.

సుమం : మంచిది. ఈమెపూజ్యుఁడైన శ్రీరాముని గన్నతల్లి కౌసల్యాదేవి.

భర : అమ్మా ! అనపరాధి భరతుఁ డభివందనముఁ జేయుచున్నాఁడు.

కౌసల్య : బిడ్డా ! సంతాపరహితుఁడవు గమ్ము.

భర : (స్వగతము) ఎంత మనోహరమైన మాట. అనుగ్రహింపబడితిని. తరువాత తరువాత.

సుమం : ఈమె పూజ్యుఁడైన లక్ష్మణుని జనని సుమిత్రాదేవి.

భర : తల్లీ ! లక్ష్మణ వంచితుఁడనైన నేను నమస్కరించు చున్నాను.

సుమిత్ర : కుమారా ! యశస్వివి కమ్ము.

భర : అనుగృహీతుఁడను. తరువాత తరువాత.

సుమం : ఇదిగో ఈమె మీ జనయిత్రి.

భర : (సరోషముగా లేచి) ఓసి పాపాత్మురాలా !

మాన్యలైన మా యమ్మల మధ్యమందు
సిగ్గు లేకుండ వచ్చి నిల్చితి విదేల ?
పుణ్యవతులైన గంగాయమునల నడుమ
దుష్టనది యేదియో వచ్చి దూరినట్లు. 16

కైక : కుమారా ! నే నేమి చేసితిని ?

భర : ఏమి చేసితినని యడుగుచున్నావా ?

నా కపకీర్తి వచ్చె; మరణంబును బొందె నృపుం; డయోధ్య దుః
ఖాకర మయ్యె; వల్కలము లార్యుఁడు గట్టె; మహీజ మార్గ ఖే
దాకుల యయ్యె; లక్ష్మణున కబ్బె మృగావళి మైత్రి; శోకమున్
జేకొని రంబ; లీవు మది ఛీయను కొంటివి సర్వఘాతినీ ! 17

కౌసల్య : కుమారా ! అన్నిధర్మములు తెలిసినవాఁడవయ్యును గన్న తల్లికి నమస్కరింపవైతివేమి ?

భర : కన్నతల్లియా ! అమ్మా ! నీవే నా కన్నతల్లివి. నమస్కార మమ్మా !

కౌసల్య : కాదు కాదు కుమారా ! నీ కన్నతల్లి కైకేయి.

భర : ఒకప్పుడేమో! ఇప్పుడు మాత్రముకాదు. చూడమ్మా !

మలినమతు లైన కుళ్లుబోతులకతాన
ఆత్మజు లనాత్మజులవలె నైరినేఁడు ;
జగతి క్రొత్తధర్మ మ్మిది, మగని మ్రింగి
తగవు దప్పిన తల్లియుఁ దల్లి కాదు. 18

కైకేయి : కుమారా! రాజుగారి సత్యవాక్య సంరక్షణకే నేనట్లుపలికితిని.

భర : ఏ మ ని ? ఏమని ?

కైకేయి : నా నందనుఁడే రాజు కావలెనని.

భర : అట్లైన నన్నగారు మాత్రము నీకేమగును ?

అతఁడు జనకున కౌరససుతుఁడు కాఁడో ?
రాజపద మందుకొంట సక్రమము కాదో ?
సోదరులు మైత్రినుండుట లేదో ? కాక
నుతగుణుం డాతఁడు ప్రజాభిహితుఁడు కాఁడో ? 19

కైకేయి : కుమారా ! ఈ ప్రశ్నలు శుల్కలుబ్ధమైన హృదయమును ప్రశ్నింపుము.

భర : వల్కలము లిచ్చి రాజ్యసంపద హరించి
కాలినడకన జానకీకాంతతోడ
నార్యు నంపించినావు ఘోరాటవులకు !
అల్ల శుల్కాన నిదియు నుదాహృతంబె ? 20

కైకేయి : కుమారా! సముచిత సమయమున నీకంతయు నెఱింగింతును.

భర :

ఈ వపకీర్తిలోభము వహించితివేని మదీయనామ మే
లా వెలికీడ్చితెచ్చితి ? వనంత మహోన్నత రాజభోగముల్
గావలె నంటివా ధరణికాంతుఁ డమర్పఁడె ? రాజమాతృ సం
భావనకాంక్షయుండెన ? కుమారుఁడు కాడొకొ నీకు రాముఁడున్.

నీవు చాల ఘోరము చేసితివి !

నరవరు ప్రాణమేని గణనంబొనరింపవు రాజ్యలుబ్ధవై,
కరుణ దొరంగి పంపితివి కానకు జ్యేష్ఠకుమారు నక్కటా !
వరగుణమూర్తి జానకి సవల్కలయై చనఁ జూచి యింతయున్
గరుగదు వజ్రకర్కశముగా నొనరించె విధాత నీ హృదిన్. 22

సుమం : కుమారా ! వశిష్ఠ వామదేవ సహితులైన పౌరులు పట్టాభిషేక ప్రయత్నములు గావించి నీ కిట్లు విజ్ఞప్తి చేయుచున్నారు.

గోగణంబులు గోపాలకుండు లేక
యవధి దప్పి చెల్లాచెదరైన భంగి
ప్రజలు పరిపాలన మొనర్చు ప్రభువులేక
శిథిలజీవనులై యథాయథలుకారె ! 23

భర : ప్రజలందఱు నా వెంట వత్తురు గాక !

సుమం : పట్టాభిషేకమును బరిత్యజించి నీ వెచ్చటికి బోయెదవు ?

భర : పట్టాభిషేకమా! దాని నిదిగో ఈ కైకమ్మ గారికి గట్టఁబెట్టుఁడు.

సుమం : మఱి నీ వెక్కడకుఁ బోయెదవు ?

భర :

రామచంద్రుఁడు లక్ష్మణ ప్రేమపూర్ణుఁ
డెటవసించు నచ్చోటికే నేగవలయు ;
నతఁడు లేనిది కా దయోధ్యాపురీంద్ర
మతఁడు నివసించునదె! నిక్కమగు నయోధ్య. 24

(అందఱు నిష్క్రమింతురు.)

6)

# చతుర్థాంకము

[ కైకేయి చెలికత్తెలగు విజయ నందినిక ప్రవేశింతురు. ]

విజయ : ఏమే నందినికా! చెప్పుము. నేఁడు ప్రతిమాగృహమును సందర్శింపఁబోయిన కౌసల్యాదేవి మొదలైన యంతఃపుర కాంతామణు లందఱు భర్తృదారకుఁడైన భరతుని జూచినా రనుకొందును! దురదృష్టవంతురాలనైన నేను మాత్రము ద్వారముననే పడియుండ వలసి వచ్చినది.

నందినిక : ఔనౌనే! మే మందఱము కనులపండువుగా రాజనందనుఁడైన భరతుని సందర్శించితిమి.

విజయ : ఇంతకు రాజకుమారుఁడు అమ్మగారితో నేమని పలికినాఁడో?

నందినిక : సరిసరి కన్నతల్లిని కన్నెత్తిచూచుటకైన ఆయన యంగీకరింప లేదు.

విజయ : అయ్యో! ఎంత యన్యాయము! కైకమ్మ రాజ్య లోభముతో రాజకుమారుఁడైన రామభద్రుని పట్టాభిషేకమును భంగము గావించినది. తాను వైధవ్యమును కొనితెచ్చుకొనినది. లోకమునకు వినాశము చేకూర్చినది. ఆమె గుండె యెంత గట్టిదో! కనుకనే అంత పాపమున కొడిగట్టినది.

నందినిక : చెలీ! ఇది విన్నావా! ప్రజలచే సంసిద్ధము చేయఁబడిన పట్టాభిషేకమును త్రోసిపుచ్చి రాజకుమారుఁడైన భరతుఁడు రామచంద్రునికొఱకై తపోవనమునకు తరలిపోయినాడు.

విజయ : (సవిషాదముగా) అయ్యో! ఆయనకూడ ఈ విధముగా నడవులపాలైపోయెను. నందినికా! రావే! రాణిగారి దగ్గరకు బోవుదము.

( ఇరువురు నిష్క్రమింతురు. )

—: ఇది ప్రవేశకము :—

(సుమంత్ర సహితుఁడైన భరతుఁడు రథస్థుఁడై సూతునితో ప్రవేశించును.)

భరతుఁడు :

భూవరుఁ డాత్మపుణ్య పరిభోగ్యము స్వర్గముఁ జేర ఘోర దుః
ఖావిల పౌరబాష్ప నివహమ్ములు జాలిగ జాలువారు కా
ల్దోవల వెంబడిన్ భువనలోచనసోముని రామునిం గనం
బోవుచునుంటి ధర్మపరిపూర్ణములైన తపోవనాలకున్. 1

సుమంత్రుఁడు : ఆహా ! చిరంజీవి భరతుఁ డీతఁడే !

తనయుఁడు దైత్యనాథుల మదం బడగించు మహీశమౌళికిన్,
మనుమఁడు యజ్ఞసాత్కృత సమస్తధనుండగు చక్రవర్తికిన్,
జనకుని శాసనమ్ము శిరసా ధరియించిన ప్రేమమూర్తి రా
ముని యనుజుండఁటే ! వనికిఁబోయెడు రామపథానువర్తియై. 2

భర : ఆర్యా !

సుమం : ఏమి కుమారా ?

భర : పూజ్యుఁడైన నా రామచంద్రు డెక్కడ ? మహారాజ ప్రతినిధియైన ఆ మహానుభావుఁ డేడీ ? శక్తి సంపన్నులకు సముదాహరణమైన ఆ యాదర్శమూర్తి యెక్కడ ? రాజ్యలోభమున కైకేయిచే బహిష్కృతుఁడైన నా ప్రభు వెక్కడ ? ఏడీ ! ఆ విశాల యశస్వి ? ఏడీ ! ఆ మహారాజనందనుఁడు ? ఏడీ ! ఆ నిత్య సత్యవ్రతుఁడు ?

అస్మదీయ జనని యభిమత మ్మిడేర్ప
నెవఁడు రాజ్యలక్ష్మినే త్యజించె
త్యాగమూర్తి నాకు దైవస్వరూపుఁడౌ
నా మహాత్ముఁ జూడ నభిలషింతు. 3

సుమం : కుమారా ! ఇదిగో ! ఇచ్చటే యీ యాశ్రమ పదమునందే యున్నాడు.

అల్లదే రాముఁ! డదిగో సీతమ్మ తల్లి !
యల్లవాఁడె సౌమిత్రి మహా యశస్వి !
సత్యమును సత్ప్రవర్తన స్వామిభక్తి
యాకృతులు దాల్చినట్లుగా నలరుచుండ్రి. 4

భర : ( సూతునితో ) ఐనచో రథము నాపుము.

సూతుఁడు : ఆయుష్మంతుని యాజ్ఞ. ( రథము నాపును. )

భర : ( రథము దిగి ) సారథీ ! ఏకాంతము నం దశ్వములను విశ్రమింపఁజేయుము.

సూతుఁడు : చిత్తము. ( నిష్క్రమించును. )

భర : ( సుమంత్రునితో ) ఆర్యా ! మన యాగమనమును మనవి చేయుఁడు.

సుమం : కుమారా ! ఏమని మనవి చేయుమందువు ?

భర : రాజ్యలోభాక్రాంత యగు కైకేయి కన్నకొడుకు భరతుఁడు వచ్చినాఁడని.

సుమం : కుమారా ! చాలును. పెద్దల దోషములను లెక్కించుట భావ్యము కాదు.

భర : మంచిది. పరదోష ప్రకటనము భావ్యము కాదు. నిజమే ! అట్లైనచో నిక్ష్వాకు వంశమునకు గళంకభూతుఁడైన భరతుఁడు వచ్చి దర్శనము వేడుచున్నాఁడని పలుకుఁడు.

సుమం : నాయనా ! నే నట్లు పలుకఁజాలను. భరతుఁడు వచ్చినాఁడని మాత్రము పలుకఁగలను.

భర : వలదు వలదు. కేవల నామ ప్రకటనము ప్రాయశ్చిత్తము లేని దానివలె నాకు దోచుచున్నది. ఐనను బ్రహ్మహత్యాపాతకులను

గూర్చి పరులు నివేదింతురా! అందుచే మీ రాగుఁడు. నే నే విన్న వించుకొందును. ఓహో! ఎవరక్కడ! పితృవాక్యపరిపాలకుఁడైన శ్రీరామచంద్రులవారి కిట్లు నివేదింపుఁడు.

మేలు మఱచువాఁడు, జాలి మాలినవాఁడు,
ప్రాకృతుండు, మొండి పట్టువాఁడు,
పరమభక్తి పరుఁడు, నరుఁ డొక్కఁ డరుదెంచె
కానుపింప ముదల గలదొ లేదొ! 5

( సీతాలక్ష్మణ సహితుఁడై రాముఁడు ప్రవేశించును. )

రాము : ( ఆకర్ణించి హర్షముతో ) విన్నావా సౌమిత్రీ! విదేహ రాజపుత్రీ! వింటివి కదా నీవు కూడ!

కనుగొన చుట్టమన్న భ్రమఁ గల్పనఁ జేయుచు స్నేహయుక్తి నా
మనసున కింపునింపెడు సమంచితమై శ్రుతిపర్వమై ఘనా
ఘన ఘన గర్జలన్ గెలుచు కంఠరవమ్మిది, యెంతయేని మ
జ్జనకు గభీర కంఠరవ సామ్యము నందెడు నీతఁ డెవ్వఁడో! 6

లక్ష్మణుడు : ఆర్యా! ఈ కంఠస్వర సమ్మేళనము నాకుఁ గూడ బంధు ప్రీతిని గలిగించుచున్నది.

ధీర సుస్నిగ్ధ వృషభ గంభీర మగుచు
ఖంగుమని మ్రోగె నెవరిదో కంఠరవము!
తగిన యెడల స్ఫుటాక్షరత్వంబునంది
వరలు సంత్రాతవలె సర్వవర్ణములకు. 7

రాము : ఎట్లైనను నీ కంఠస్వరము తప్పకుండ దగ్గరి బంధువులదేగాని యితరులది కాదు. ఇది నా హృదయమును కదలించుచున్నది. నాయనా! సౌమిత్రీ! అదేమో చూడుము.

లక్ష్మ : చిత్తము. ( పరిక్రమించును. )

భర : ఏమిది! నాకెవ్వరును ప్రత్యుత్తర మీయకున్నారు! కాకున్నచో కైకేయీ కుమారుఁడైన భరతుఁడనుగా గుర్తింపఁబడలేదుగదా!

లక్ష్మ : (విలోకించి) ఓహో! ఇదేమి! అన్నయైన శ్రీరాముఁడే! కాదు కాదు. రూపురేఖలు మాత్ర మట్లున్నవి.

వదనము చంద్రబింబ, మెనవచ్చు మదగ్రజు నాస్యలక్ష్మి; కి
య్యది యుర మా సురారుల శరాళి నెదిర్చిన తండ్రిగారి పెం
పొదవిన పీనవక్ష మటులొప్పెడు; తేజముప్రోవు రూపసం
పద సుమనోజ్ఞ; మీనృపకుమారుఁడు జిష్ణువో! కాక విష్ణువో!

(సుమంత్రుని జూచి) ఓహో! ఆర్య సుమంత్రులు!

సుమం : (లక్ష్మణుని జూచి) ఆహా! కుమార లక్ష్మణుఁడు!

భర : అటులనా! అన్నగారా యీయన? ఆర్యా! అభివాదములు.

లక్ష్మ : రమ్ము. రమ్ము. ఆయుష్మంతుఁడవు కమ్ము. (సుమంత్రునిజూచి) ఆర్యా! ఎవ రీయన?

సుమం : కుమారా!

అల రఘు మహీశుని ప్రపౌత్రుఁ డజనరేశు
పౌత్రుఁడు భవత్పితకు ప్రియపుత్రుఁ డరయ
ఇనకుల లలాముఁడైన రామునకు నిన్ను
వంటి గారాబు తమ్ముఁడు భరతుఁ డితఁడు. 9

లక్ష్మ: ఇక్ష్వాకు కులాలంకారా! రమ్ము రమ్ము. ఆయుష్మంతుఁడవు గమ్ము. నీకు శుభ మగుగాక!

గండరగండలై రణముఖంబుల దైత్యుల రూపు మాపి, యా
ఖండల వజ్రము న్నొరయఁగల్గిన విండ్లు ధరించు తొంటి మా
ర్తాండకుల ప్రదీపకుల యట్లు వెలుంగుము – విశ్వజిద్యశో
మండితుఁడౌ రఘుప్రభువు మాడ్కి నఖండ గుణోజ్జ్వలుండవై.

భర : అనుగ్రహింపఁబడితిని.

లక్ష్మ : కుమారా ! నీ విచట నుండుము. నీ యాగమన మార్యులకు నివేదింతును.

భర : ఆర్యా ! శీఘ్రముగా నివేదింపుఁడు. ఆర్యున కభివందనము చేయుటలో నాలస్యము సహింపలేను.

లక్ష్మ : మంచిది. (రాముని సమీపించి) జయము జయము. ఆర్యులకు !

ఆర్య ! అరుగుదెంచె ననుఁగు సోదరుఁడైన
భాతృ వత్సలుండు భరతుఁ డిడుగో !
దర్పణమున యట్లు త్వన్మూర్తి యవ్వాని
భవ్యమూర్తి యందు ప్రతిఫలించు ! 11

రామ : నాయనా ! సౌమిత్రీ ! ఏమీ భరతుఁడు వచ్చెనా ?

లక్ష్మ : చిత్తము.

రామ : జానకీ ! భరతుని గన్నులపండువుగాఁ గాంచెదవుగాక !

సీత : ఆర్యపుత్రా ! ఏమి భరతుఁడే వచ్చెనా ?

రామ : అవును జానకీ !

ఎంత దుస్సహాబాధ సహించినాఁడో
నాఁడు మా తండ్రి గుర్తించినాఁడ నేడు ;
ఏమి ! ఏమి ! భ్రాతృప్రేమ మిట్టిదైన
నెట్టి దానో పుత్రప్రేమ మెంచగలనె ! 12

లక్ష్మ : ఆర్యా ! చిరంజీవి లోనికి రావచ్చునా ?

రామ : వత్సా ! సౌమిత్రీ ! ఈ విషయమునఁ గూడ నా యభిప్రాయ మడుగవలెనా ? కుమారభరతుని సత్వరముగా సగౌరవముగా లోనికిఁ దీసికొని రమ్ము.

లక్ష్మ : ఆర్యుల యాజ్ఞ.

రామ : లేకున్న నీవు కొంచెె ముందుము.

బహుతుషార పూర్ణోత్పల పత్రనేత్ర
యాచు సెవతె వెలార్చు హర్షాశ్రుధార,
నట్టి యీ మెను స్వయముగా నరుగనిమ్ము
మాతృభావాన గారవింపఁగ కుమారు! 13

సీత : ఆర్యపుత్రుల యాజ్ఞానుసారమే చేసెదను. (లేచి పరిక్రమించి భరతు నవలోకించి) ఇదేమి! ఇప్పుడు లోపలనున్న ఆర్యపుత్రు లింతలో నాశ్రమము వెలుపలి కెప్పుడు వచ్చినారు? కాదు కాదు! రూపసామ్యము!

సుమం : ఓహో! వధూమణి వైదేహి!

భర : ఏమీ! ఈమెయేనా పూజ్యురాలైన జానకీదేవి!

నేల కడుపున నాగేటి చాలునందు
జననమైన స్త్రీరూప తేజశ్శలాక!
పరమ ధన్యుఁడౌ జనక భూపాళమౌళి
యింట వెలసిన తపముల పంట యీమె! 14

అమ్మా! అభివాదములు. నేను భరతుఁడను!

సీత : (స్వగతము) రూపము మాత్రమేకాదు. కంఠస్వరముకూడ నొక్కటే! (ప్రకాశముగా) నాయనా! చిరంజీవివి కమ్ము.

భర : అనుగ్రహింపబడితిని.

సీత : రమ్ము నాయనా! అన్నగారి యభీష్టమును బూరింపుము.

సుమం : కుమారా! లోనికిఁ బ్రవేశింపుము.

భర : ఆర్యా! ఇప్పుడు మఱి మీరేమిచేయుదురు?

సుమం : స్వర్గమునకు విభుఁడు చనిన వృత్తాంతమ్ము
విన్న వెనుక స్వామి నన్ను గనుట
కిదియ మొదటిసారి, యిల్లొటచే లోని
కేగు దెంతు కొంచెె మాగి నేను! 15

భర : మంచిది. అట్లే కానిండు. ( రాముని సమీపించి ) ఆర్యా ! ప్రణామములు. భరతుఁడను నేను.

రామ : రమ్ము. ఇక్ష్వాకునందనా ! రమ్ము. స్వస్తి. ఆయుష్మాన్ భవ !

సరిసరి ! ఏది ! ఏది ! ఒకసారి కవాట పుట ప్రమాణ మీ
యురమును విప్పుచేసి విపులోరు భుజాంతర మందు హత్తుకో
మ్మురా ! శరదిందు కల్ప మగు మోము నొకించుక నెత్తి వేదనా
జ్వర పరిదగ్ధ దేహ మిది చల్లని చూపుల హాయి సేయరా ! 16

భర : ధన్యోస్మి !

సుమం : ( సమీపించి ) ఆయుష్మంతునకు జయము !

రామ : హా ! తండ్రీ !

మహిత బలమ్ముతో సురవిమాన సమాన రథాధిరూఢుఁడై
యహితుల దైతులన్ గలచి యాకస మెల్లెడఁదానయై మహా
మహుఁ"డతఁడాతఁడే"యనియమర్త్యులమన్ననలందుకొన్నయా
మహిపతి నిన్నుగూడ విడి మా పితృదేవుల పాలి కేగెనే ! 17

సుమం : ( శోకముతో )

నరపతి దిక్కులేని మరణమ్ము, భవద్విపిన ప్రవాస, మీ
భరతు విషాదగాథ, రఘువంశము దిక్కరియుంట, కంటితో
నరసెడు యోగముండియె గదా ! బ్రతుకీడ్చుచు నిట్టులుంటి; దు
ర్భరమయి దుస్సహమ్మయి చిరాయు విదెంతటి వంతగూర్చెనో !

సీత : దుఃఖించుచున్న ఆర్యపుత్రులను తాతగారు మఱియు దుఃఖింపఁ జేయుచున్నారు.

రామ : జానకీ ! ఇదిగో నేను దుఃఖమును దిగమ్రింగు కొనుచున్నాను. వత్సా ! సౌమిత్రీ ! మంచినీరు.

లక్ష్మ : చిత్తము. ( పోఁబోవును. )

భర : ఆర్యా ! ఇది సక్రమము కాదు. క్రమ ప్రకారము మీ సేవ నేను చేయవలయును. నేను పోయి తెచ్చెదను. (కలశముతో నీరు తెచ్చి) ఇదిగో ఉదకము.

రామ : (ఆచమించి) జానకీ ! లక్ష్మణునికి పని తగ్గినది.

సీత : ఆర్యపుత్రా !. ఈ తమ్ముని శుశ్రూషయు నందుకొనవలసినదే గదా !

రామ : మంచిది. ఇచ్చటనుండి లక్ష్మణుఁడును నచ్చటినుండి భరతుఁడును నన్ను సేవింతురు గాక !

భర : ఆర్యులనుగ్రహింపవలెను.

నేను సైతము కానలోనే వసించి
సర్వరాజ్యకార్యంబులు నిర్వహింతు ;
ఎచట నుండిన నేమి స్వామీ ! త్వదీయ
నామమే యింక ప్రజకు శ్రీరామరక్ష. 19

రామ : వత్సా ! కైకేయీ నందనా ! కాదు కాదు. ఇది సరికాదు.

జనకుని శాసనమ్ము శిరసా వహియించి స్వధర్మ దీక్షమై
వనమున కిట్లు వచ్చితిని వత్స ! భయమ్మున రాను–దర్పకా
రణమున రాను–భ్రాంతిమెయి రాను–సముజ్జ్వల సత్యవిస్ఫురం
గని మన వంగడ మ్మెటుల కాదని నీచపథమ్ముఁ ద్రొత్తువో ! 20

సుమం : మంచిది. ఇప్పుడీ యభిషేకాంబువు నేమి చేయవలయును ?

రామ : అది మాయమ్మగారెచ్చట నుంచమనిరో యచ్చటనే యుంచ వలయును.

భర : అన్నగారు ప్రసన్నులు కావలయును. ఆర్యా ! ఇఁక చాలు. గాయముపై ప్రహరింపకుఁడు.

గుణనిధీ ! నీ వలెనె నేను జనన మైతి !
నిన్ను గన్నతండ్రియె నన్ను గన్నతండ్రి !
తల్లి చేసిన తప్పు పుత్రకుని దౌనె ?
వరద ! మన్నింపు నన్నిచ్చవచ్చినట్లు. 21

సీత : ఆర్యపుత్రా ! భరతుఁ డతికరుణముగా ప్రార్థించుచున్నాఁడు. ఇంకను మీ రేమేమో యాలోచించుచున్నారు ?

రామ : జానకీ !

శ్రీ సముపేతు నింతటి విశిష్టగుణున్ సుతుఁ జూడ నోచకే
తా సురలోకముం జనిన ధారణినాథు గురించి యింతగాఁ
జేసెద చింత — యిట్టి గుణశీలుని గన్న మహానుభావులున్
దాసులశే యిసీ విధికి ! తానది యెంతటి దుష్టశక్తియో ! 22

నాయనా ! కైకేయీనందనా !

నీ వకలంకచిత్తుఁడవు, నీ పలుకాడిన రీతి నచ్చె, ఔ
నౌ ! విజితుండ నీదు సుగుణాళికి, నంతయు నంతసంబె కా
నీ ! వసుధాధినేత పలు కీ వనృతం బొనరింప నౌనె ! మి
థ్యావచనుండు తండ్రియగునా ! నినువంటి కుమారు నోచియున్.

భర : అధిప ! నియమావసాన పర్యంత మిచట
నిలుతు నేను త్వత్పాద సాన్నిధ్యమందె !

రామ : వలదు కననిమ్ము నిజపుణ్యఫలము ఱేని
నీకు నా యాన రాజ్యాన నిలువవేని ! 24

భర : అబ్బా ! ప్రత్యుత్తరము లేని పలుకులు పలికితిరి. సరే కానిండు. నేను తమదైన యీ రాజ్యమును బరిపాలించుటకు తమ రొక ప్రతిజ్ఞ చేయవలయును.

రామ : వత్సా ! ఏమిటా ప్రతిజ్ఞ ?

భర : నా చేతులలో నుంపఁబడిన తమ రాజ్యమును పదునాల్గు సంవత్స
రముల యనంతరము తిరిగి తమరు ప్రతిగ్రహింపవలయును.

రామ : మంచిది. అట్లే కానిమ్ము.

భర : ( లక్ష్మణునితో ) అన్నా ! విన్నావా ! ( సీతతో ) అమ్మా !
విన్నావా ! ( సుమంత్రునితో ) ఆర్యా ! విన్నారా !

అందఱు : మేమందఱము వింటిమి.

భర : ఆర్యా ! మఱియొక వరముఁగూడ నడుగ నభిలషించుచున్నాను.

రామ : వత్సా ! నీ వాంఛితమేమి ? నన్నేమి చేయమందువు ?

భర : శిరసు వాంచి నమస్కృతుల్ సేయు నాకు
తమ పవిత్ర పాదోపభుక్తంబులైన
పాదుకల నిండు ! వానికేఁ బ్రతినిధినయి
సేవ నేసు భవత్కార్యసిద్ధివఱకు. 25

రామ : ( స్వగతము ) ఆహా ! ఎంత విచిత్రము !
చాలకాల మ్మిట్టుల్ గడ చన్న వెనుక
నే సమార్జించుకొంటి కించిద్యశంబు !
అచిరకాలమ్ము నందె తా నంతకీర్తి
చిన్న తమ్ముఁడు భరతుఁ డార్జించుకొనియె. 26

సీత : ఆర్యపుత్రా ! పాపము భరతుని ప్రప్రథమ వాంఛితము దీర్పరా !

రామ : తథాస్తు. వత్సా ! గ్రహింపుము. ( పాదుకల నొసంగును. )

భర : అనుగ్రహింపఁబడితిని. ( పాదుకలు పరిగ్రహించి ) ఆర్యా !
ఇచ్చటనే వీని నభిషేకింప నుత్సాహము పడుచున్నాను.

రామ : (సుమంత్రునితో) ఆర్యా ! చిరంజీవి భరతుని కోరికప్రకారము
సమస్తము జరిపెంపుఁడు.

సుమం : మంచిది. ఆయుష్మంతుఁ డాజ్ఞాపించినట్లే !

భర : (స్వగతము) ఆహా ! ఎంత సంతోషము !
స్వజనము విశ్వసించును-ప్రజల్ సరి యందురు-యోగ్యశీలుఁ డా
త్మజుఁ డని మెచ్చు స్వర్గతుఁడు తండ్రి-ననున్ జగమాదరించు.న
క్కజముగ గీర్తి వచ్చు-పలుగాథలలో నుతి గందు-నెవ్వరుం
గుజగుజ లాడఁజాల-రనుగున్ సయిదోడులు మంతు రెంతయున్ !

రామ : వత్సా ! కైకేయీ కుమారా ! ముహూర్త మాత్రముగూడ రాజ్యరక్షణము నుపేక్షింపరాదు. అందువలన నీ విప్పుడే కర్తవ్యము నిర్వర్తించుటకై మరలి పోవలయును.

సీత : ఏమీ ! భరతుఁ డిప్పుడే మరలిపోవునా ?

రామ : కొంచెము నిబ్బరించుకొనవలెను. చిరంజీవి యిప్పుడే నెడలిపోక తప్పదు.

భర : ఆర్యా ! నేనిదే బయలుదేరుచున్నాను.

మిమ్ము దర్శించు కౌతూహలమ్ముతోడ
పురజనమ్ములు వేచి యుందురు గదయ్య !
వేగఁ జని వారి కనులకు విందుసేతు
త్వత్పవిత్ర ప్రసాద ప్రదర్శనమున ! 28

రామ : ఆర్యా ! తండ్రిగారివలెనే తమ్మునిగూడ కనిపెట్టి యుండుఁడు.

సుమం : ఈ బొందిలో ప్రాణము లున్నచో నట్లే చేయ యత్నింతును.

రామ : వత్సా ! కైకేయీ కుమారా ! నా సమక్షముననే స్యందనము నారోహింపుము.

భర : ఆర్యు లాజ్ఞాపించినట్లే. (భరత సుమంత్రులు రథము నధిరోహింతురు.)

రామ : రా ! జానకీ ! రమ్ము సౌమిత్రీ ! ఆశ్రమపదద్వారము వఱకైన భరతుని సాగనంపుదము.

*( అందఱు నిష్క్రమింతురు. )*

---

# పంచమాంకము

*[సీతయును తాపసియును ప్రవేశింతురు.]*

సీత : ఆర్యా! పూజాపుష్ప సమాకీర్ణమైన యాశ్రమమును సమ్మార్జనము గావించితిని. ఆశ్రమలభ్యములైన వస్తువులతో దేవపూజ నిర్వర్తించితిని. ఆర్యపుత్రులింకను రాలేదు. వారు వచ్చులోపల నీ పూల మొక్కలకు నీరు పోయుదును.

తాపసి : నీ కర్తవ్యము నిర్విఘ్న మగుఁగాక!

*(రాముడు ప్రవేశించును.)*

రామ : (శోకముతో)

దివ్య దయోధ్య నేను పితృదేవుఁడు లేమి త్యజించి, సాధుసం
సేవ్య గుణాఢ్యుఁ డస్మ దభిషేక మతిన్ భరతుండు వచ్చె; నా
భవ్య చరిత్రునిన్ మరలఁ బంపితి నచ్చటికే, విశాల రా
జ్య వ్యవహార భార మకటా! యొకఁడే యెటు మోయుచుండెనో!

(ఆలోచించి) ఔను. ఇది యిటువంటిదే! ఈ దృశ్యశోక నివారణమునకై సహధర్మచారిణి యగు జనకరాజనందనను సందర్శింపను. ఏది! వైదేహి యెచ్చట? (పరిక్రమించి చూచి) ఇదిగో! ఇప్పుడిప్పుడే తడుపఁబడిన ఈ మహీరుహ మూలములు జానకి సామీప్యమును సూచించుచున్నవి. ఔను!

నురుగులు గట్టు నీరము లనోకహ మూలములన్ వడిన్ సుడిం
దిరుగుచు, గ్రోల పీ బురదనీరు ఖగంబులు గొంతు లెండియున్,
పురువులు వెల్వడున్ సలిల పూర్ణ బిలంబుల నుండి, యేర్పడున్
దరువుల చుట్టు తోయములు తగ్గుకొలంది నవాంబురేఖికల్. 2

(చూచి) ఇదిగో వైదేహి! అక్కటా! ఎంతకష్టము.

దర్పణము దాల్పఁ గందు సుందరి కరమ్ము
కలశము వహింప సుంతైన కష్టపడదు;
లతల లలనామణుల కోమలత నడంచి
కఠిన భావమ్ము నేర్పును కాననమ్ము. 3

(సమీపించి) జానకీ! నీ తపస్సు చక్కఁగా వర్ధిల్లు చున్నదా ?

సీత : (చూచి) ఏమీ! ఆర్యపుత్రులా! జయము! జయము!

రామ : జానకీ! నీ ధర్మదీక్ష కాటంకము లేకుండిన నిటుకూర్చుండుము.

సీత : చిత్తము. (కూర్చుండును.)

రామ : జానకీ! నీ వేదియో ప్రశ్నింపఁబోవు దాని వలెఁ గన్పించు చున్నావు!

సీత : అరుణారుణమైన ఆర్యపుత్రుల వదన మదేదో శోక వ్యాకులమైన హృదయమును సూచించుచున్నది. ఎందులకో ?

రామ : సత్యమే జానకీ! నా స్వాంతము చింతాక్రాంత మే యైనది.

క్రూరవిధి నాఁడు పెనుబాకు గ్రుచ్చినాఁడు
కాయమున నేటి కది గుండె గాయ మయ్యె;
అచ్చటే యచ్చటే వచ్చి వచ్చి తగులు
వివిధ ఫల సంగతులు శోక విశిఖ తతులు. 4

సీత : ఆర్యపుత్రుల యనుతాప మేమో అర్థము కాలేదు.

రామ : జానకీ! రేపే పూజ్యులైన నాయనగారి శ్రాద్ధవిధి. పితృదేవతలు కల్పవిశేషముతోఁ గూడిన పిండ ప్రదానమును వాంఛింతురు. ఈ కార్యము నెట్లు నిర్వర్తింపగలనా యని యాలోచించు చున్నాను. కాకున్నను –

వారు నాస్థితి నెఱిఁగిన వార లగుట
నెది సమర్పించినను తుష్టినే వహింత్రు;
ఐన నే సమారాధింప నభిలషింతు
తండ్రిగారికి నాకును దగిన భంగి. 5

సీత : ఆర్యపుత్రా! సమస్త వస్తు సంభారములతో భరతుఁడీ శ్రాద్ధ కర్మమును జక్కఁగా నిర్వర్తించును. ఆర్య పుత్రులుకూడ అవస్థాను రూపముగా ఫలోదకములతో దీనిని నెఱవేర్పఁగలరు. ఇది మామ గారికి మఱింత సంతోషదాయకమును గాఁగలదు.

రామ : జానకీ !

దర్భలందు మదీయ హస్తముల తోడ
పఱచు వన్యఫలంబుల నరసి యరసి
మన యరణ్యా వాసంబు నెమ్మది స్ఫురింప
జనకుఁ డెలుఁగెత్తి యేడ్చు నచ్చటను గూడ. 6

*( పరివ్రాజక వేషముతో రావణుఁడు ప్రవేశించును. )*

రావ : ఇదిగో ! నేను రానేవచ్చితిని.

వేసమువేసి చంచలత వీడని చిత్తముతో, రఘూద్వహున్
మోసముచేసి, మా ఖరుని మున్ను వధించిన కచ్చెదీర, వి
శ్వాసముమై నటించి, స్వరసంగతి వీడిన హవ్యధారయౌ
భూసుత నెట్టులైనఁ గొనిపోవఁ దలంచితి నేగుదెంచితిన్. 7

( పరిక్రమించి క్రిందకు చూచి ) ఇదే రాముని యాశ్రమద్వారము. కావున నిచ్చట నవతరింతును. ( దిగును. ) ఇఁక నే నతిథి మర్యాద నభినయింపవలెను. ఇదిగో ! నే నతిథిని ! ఎవరక్కడ ?

రామ : ( ఆలకించి ) అతిథులకు స్వాగతము !

రావ : బాగు బాగు. స్వరము స్వరూపమునకు వన్నెబెట్టుచున్నది.

రామ : ( చూచి ) ఓహో ! అతిథి భగవానుఁడు ! స్వామీ ! అభివందన ములు.

రావ : శుభమగుగాక !

రామ : స్వామీ ! ఇదిగో ఆసనము. ఉపవిష్టులు కండు.

రావ : ( స్వగతము ) ఏమీ ! ఇతడు న న్నాజ్ఞాపించుచున్నట్లున్నది. ( ప్రకాశముగా ) మంచిది. ( కూర్చుండును. )

రామ : జానకీ ! భగవానునికి పాద్యము నందుకొనుము.

సీత : ఆర్యపుత్రుల ఆజ్ఞ. ( నిష్క్రమించి మరల ప్రవేశించి ) ఇదిగో పాద్యము.

రామ : రమ్ము. భగవానునికి పరిచరింపుము.

సీత : ఆర్యపుత్రు లాజ్ఞాపించినట్లే.

రావ : ( పర్యాకులుఁడై ) చాలు చాలు.

ఈమె యొక్కతె సతుల యందెల్ల నవని
నల యరుంధతి యంత పుణ్యముల రాశి -
ఆమె పతి వౌట మహిళాజనాళి చేత
గౌరవాధిక్య మందెదు గాదె నీవు ! 8

రామ : మంచిది. ఉదకము నిటుతెమ్ము. నేనే స్వామికి శుశ్రూష చేయుదును.

రావ : ఛాయ నే పరిహరించిన నేను శరీరము నెట్లంగీకరింతును ! మధురములైన మీ మాటలే నా కాతిథ్యము. పూజితుఁడ నైతిని. కూర్చుండుము.

రామ : చిత్తము. ( కూర్చుండును. )

రావ : ( స్వగతము ) ఇఁక నేను బ్రాహ్మణ మర్యాద ననుష్ఠించి ప్రవర్తించెదను. (పకాశముగా) ఓయీ ! నేను కాశ్యప గోత్రోద్భవుఁడను. సాంగోపాంగముగా వేదాధ్యయనము గావించితిని. మను ధర్మశాస్త్రమును, మహేశ్వరుని యోగశాస్త్రమును, బృహస్పతి యర్థశాస్త్రమును, మేథాతిథి న్యాయశాస్త్రమును, ప్రచేతసుని శ్రాద్ధకల్పమును జక్కగాఁ జదివితిని.

రామ : ఏమేమీ ! శ్రాద్ధకల్పమును గూడనా ?

రావ : సమస్త శ్రుతుల నతిక్రమించి శ్రాద్ధకల్పముపై మనసుపోయినదే ! ఇదేమి ?

రామ : స్వామీ ! తండ్రిని పోగొట్టుకొన్న నాకు ప్రస్తుత మీ యాగ మమే యావశ్యకము.

రావ : సరే ! సందేహ మెందులకు ! ప్రశ్నింపుము.

రామ : స్వామీ ! పిండప్రదాన సమయమున పితృదేవతలను దేనితో సంతృప్తిపరుపనగును ?

రావ : శ్రద్ధతో సమర్పించిన సమస్తమును శ్రాద్ధమే !

రామ : స్వామీ ! శ్రద్ధాహీనమైనది పరిత్యక్తమే ! కాని నేను విశేషార్థమును బ్రశ్నించుచున్నాను.

రావ : ఐనచో నాకర్ణింపుము. తృణాంకురములలో దర్భలు, నోషధులలో నువ్వులు, శాకములలో శనగలు, మత్స్యములలో మహాశపరము, పశులలో వార్ధ్రాణసము, జంతువులలో ధేనువు లేదా ఖడ్గమృగము అనునవి మానవులకు విధి విహితములు.

రామ : స్వామీ ! 'లేదా' యనుటచే మఱొక్క టేదో యున్నట్లు స్ఫురించుచున్నది.

రావ : అవును. ఉన్నది. అది కేవలము సామర్థ్యముచే సంపాదింపఁ దగినది.

రామ : స్వామీ ! అట్లైన నిదియే నా నిశ్చయము,

తత్సమార్జన మొనరింపఁ దగినదేని
నా యధీనమ్మె యా సాధనద్వయమ్ము —
ధనువు నంపెద తప మలసినద యేని
తపము నంపెద ధనువు శ్రాంతమ్మ యేని. 9

రావ : ఉన్నవి. అయితే అవి హిమవత్పర్వతమున నివసించుచున్నవి.

రామ : హిమవంతముననా ? సెలవిండు సెలవిండు !

రావ : హిమశైల సప్తమ శిఖరమున కాంచన పార్శ్వములను మృగములు సంచరించుచుండును. అవి సాక్షాత్ పరమేశ్వర శిరః పతితములగు గంగా జలములను గ్రోలుచుండును. వాని పృష్ఠములు వైడూర్యశ్యామములై విరాజిల్లును. అవి పవమాన సమాన గమనముతో నొప్పారుచుండును. మదిలో భావించినంతమాత్రముననే సమీప సముపస్థితములై విపన్నములగు నీ మృగముల తోడనే వైఖానస, వాలఖిల్య, నైమిశీయాది మహర్షులు శ్రాద్ధ విధులను నిర్వర్తింతురు.

వాని పరిగ్రహించి పితృవర్గము గాంచు నపత్యలాభ, మా
పై నవదీప్తితో ముదిమిఁ బాసి సుఖింతురు స్వర్గసీమ, గీ
ర్వాణులతో విమానములపై విహరింతురు చెల్మి, బల్మిమై
నైన సుడుల్ వెలార్చు విషయంబులలోఁబడఁబోరు వెండియున్.

రామ : జానకీ! విలంబ మెందులకు ?

అయిన స్వయం సముజ్జ్వల మహౌషధి దీప్తిమయంబులౌ హిమా
లయ కమనీయ కాననములన్ వసియింప ననుజ్ఞ వేడుమా!
ప్రియసుత నర్విశేషముగఁ బెంచిన జింకల, భూరుహాల, నీ
ప్రియ సఖులౌ లతా తతులఁ బ్రేముడి వింధ్యగిరిన్, తపోవనిన్.

సీత : ఆర్యపుత్రుల యాజ్ఞ.

రావ : కౌసల్యాకుమారా! అలవిమాలిన కోరికలు కోరకుము. అవి మానవులకు కానుపింపవు.

రామ : స్వామీ! అవి హిమవంతమున నివసించుచుండును గదా ?

రావ : అవును.

రామ : అట్లైనచో నిఁక చూడుఁడు—

దివ్యమృగములఁ దాఁజూపి తీరవలయు
నల్ల హిమవంతుఁ డట్లుకాదా! మదీయ
బాణవేగాన క్రౌంచపర్వతమువోలెఁ
గూలిపోవలె భిన్నుఁడై కువలయాన. 12

రావ : (స్వాగతము) ఔరా! ఈతని యహంకార మసహ్యాముగా నున్నది. (ప్రకాశముగా) అరే! అదేమో మెఱపు మెఱసి నట్లున్నది.

రామ : (ఆ దిక్కు పరికించి) అవును మెఱపు మెఱసినట్లే యున్నది.

రావ : కౌసల్యాకుమారా! ఇచ్చటనే నిన్ను హిమవంతుడు సన్మా నించుచున్నాఁడు. ఇదిగో కాంచన పార్శ్వమృగము!

రామ : ఇదంతయు స్వాముల యనుగ్రహామే!

సీత : ఆర్యపుత్రు లదృష్టవంతులు!

రామ : కాదు కాదు.

స్వయముగా స్వర్ణ మృగ మిటు వచ్చెనేని
దేవి! యది పితృదేవు నదృష్ట ఫలమె!
అదియు పూజావిధిని సమర్హత వహించు,
దాని గొని రమ్మనుము సుమిత్రాకుమారు! 13

సీత : ఆర్యపుత్రా! సౌమిత్రిని తీర్థయాత్రనుండి తిరిగివచ్చిన కులపతిని తోడితెచ్చుటకై పంపియుంటిరి గదా!

రామ : అట్లైనచో నేనే పోయెదను.

సీత : ఆర్యపుత్రా! అంతవరకు నన్నేమి చేయుమందురు?

రామ : భగవానునకుఁ బరిచర్య చేయుచుండుము.

సీత : ఆర్యపుత్రుల ఆజ్ఞానుసారమే!

*(రాముఁడు నిష్క్రమించును.)*

రావ : ఔరా! ఇప్పు డర్ఘ్యము ధరించి నా ముందున్న రాఘవుఁడు— అడుగో! అప్పుడే నా పూజ పరిత్యజించి పరుగెత్తుచున్న మృగము వెంటబడినాడు. అడుగో! ధనుస్సు నెక్కిడుచున్నాడు.

ఎంత బల? మెంత వీర్య? మ్మదెంత సత్త్వ?
మౌర! ఎంతటి దతని వేగాతిశయము!
అందుకే యీ ప్రపంచము నందు నిండె
"రామ" యనునట్టి నామాక్షరములు రెండె! 14

అదిగో! ఆ మృగము రాఘవుని శరపాతము నొక్క గంతులో తప్పించుకొని సాంద్రారణ్యమును బ్రవేశించినది.

సీత : (స్వగతము) ఆర్యపుత్ర-వియోగముచే నా కిచ్చట భీతి వొడము చున్నది.

రావ : (స్వగతము)

అరిగె రాముఁడు నాదు మాయా వశాన,
సీతఁ గొనిపోదు నిఁక వనసీమనుండి;
ఇతి సమంత్రోక్తమైన యాహుతి విధాన
చిన్నదాని నొంటిగ నేడ్చుచున్నదాని. 15

సీత : నేను పర్ణశాలాభ్యంతరమున కేగెదను. (పోఁబోవును)

రావ : (నిజరూపమును గ్రహించి) సీతా! నిలు నిలు.

సీత : (భయముతో) అమ్మయ్యో! ఇదేమి! ఈతఁ డెవ్వఁడు?

రావ : ఏమీ! ఎఱుఁగవా వీనిని!

ఎవని నేత్రంబు లవెట్లు దర్శించెనో
భరియింపరాని శూర్పణఖ ముఖము!
ఎవని శ్రోత్రంబు లవె ట్లాలకించెనో
ఖర దూషణాది సోదర వధంబు!
ఎవని మాయాయుక్తి యెట్లు వంచించెనో
అతిధైర్య శౌర్య గర్వాంధు రాము!
ఎవని భుజాశక్తి యెట్లు నిర్జించెనో
శక్రాది దేవతా సంచయమును;

అట్టి నా కథలెల్ల నీ కప్పగించి
నిన్ను గొనిపోవ నే వచ్చియున్నవాఁడ;
జాలమింకేల! లోల విశాల నయన!
రావణుండ విపక్ష విద్రావణుండ! 16

సీత : అమ్మయ్యో ! రావణుఁడా ! ( వెడల నుంకించును. )

రావ : ఏమీ ! ఈ దశకంఠుని కంటబడి యింక నెక్కడకు బోయెదవు ?

సీత : ఆర్యపుత్రా ! రక్షింపుము. రక్షింపుము. సౌమిత్రీ ! కాపాడుము. కాపాడుము.

రావ : సీతా ! నా పరాక్రమము నాకర్ణింపుము.

జితుఁడయ్యెన్ సురసార్వభౌముఁడు—చలించెన్ విత్తనాథుండు—మ
ర్దితుఁడయ్యెన్ శమనుండు—నేలపయి డించెన్ చంద్రు—డీరీతి దు
ర్గతులై స్వర్గతులైరి దేవత లిసీ ! త్రస్తాత్ములై ; నీ యుప
స్థితిచే నీ క్షితి ధన్యమైనది గదే ! శీతాంశుబింబాననా ! 17

సీత : ఆర్యపుత్రా ! రక్షింపుము. రక్షింపుము. సౌమిత్రీ ! కాపాడుము. కాపాడుము.

రావ : మగని రామచంద్రు మఱఁది సౌమిత్రిని
దివికిఁ జనిన దశరథేశు నేని
శరణ మడుగు – మేల చచ్చు సంప్రార్థనల్ ?
పులిని హరిణకములు గెలువఁగలవె ? 18

సీత : ఆర్యపుత్రా ! రక్షింపుము. రక్షింపుము. సౌమిత్రీ ! కాపాడుము. కాపాడుము.

రావ : ఏల విలపింతు విట్లు విశాలనయన !
నన్ను నీ పతిరీతి మన్నన మొనర్పు ;
మతుల బలుఁడైన, దివిజ సాహాయ్య మున్న
సుదతి ! నన్ను రాముఁడు జయించుటలు సున్న. 19

సీత : ( సరోషముగా ) అభిశప్తుఁడ వైతివి.

రావ : ( స్వగతము ) ఆహా ! ఏమీ పతివ్రతా ప్రభావము !

> పైకి కుప్పించి దూకఁ గాల్పంగలేదు
> చండ మార్తాండ కర సహస్రంబు లపుడు ;
> దగ్ధ మొనరించుచుండె నీ ముగ్ధ యన్న
> " శప్తుఁడ " వటన్న యలఁతి యక్షరము లిపుడు. 20

సీత : ఆర్యపుత్రా ! రక్షింపుము. రక్షింపుము.

రావ : (సీతను గ్రహించి) ఓహో ! జనస్థానవాసులగు తపోధనులారా ! మీ రందఱును వినుఁడు ! వినుఁడు !

> భూమిజం బల్మిఁ బట్టి కొంపోవుచుండె
> కనుఁడు దశకంఠుఁ డిదె పరాక్రమము చూపి ;
> క్షాత్రధర్మ సంరక్షణాసక్తి యున్న
> రమణిఁ గాచుకొమ్మనుఁడు మీ రామచంద్రు. 21

సీత : ఆర్యపుత్రా ! రక్షింపుము. రక్షింపుము.

రావ : ( పరిక్రమించి చూచి ) ఓహో ! స్వపక్ష పవన విక్షేపముచే నరణ్య వృక్షముల నల్లకల్లోలము జేయుచు, ప్రచండ చంచూ సముద్దండుఁడగు జటాయు విటే వచ్చుచున్నాడు. ఆగు. జటాయూ! ఆగు.

> పాపి ! మద్భుజాకృష్ట కృపాణధార
> నీదు పక్షద్వయంబు ఖండించివైతు ;
> రక్తధారాసమార్ద్రి గాత్రమ్ముతోడ
> సాగనంపుదు నిన్ యమ సదనమునకు. 22

( నిష్క్రమింతురు. )

---

# షష్ఠాంకము

*[ఇరువురు వృద్ధతాపసులు ప్రవేశింతురు.]*

తాపసులు : అయ్యలారా! రక్షింపుఁడు. రక్షింపుఁడు.

ప్రథముఁడు : అయ్యో! అయ్యో! ఇంకేమున్నది!

నల్లని కల్వపూసర మనందగు చిక్కని మేని కప్పుతో,
తెల్లని తమ్మిత్రాడుల గతిన్ బెనుదంష్ట్రలు కాంతులీన, న
ల్లల్లన నవ్వుకొంచును నిశాచరుం డసురేంద్రుఁ డొంటిమై
నల్లదె కొంచుఁ బోవు నకటా! హరిణాంగనవంటి జానకిన్. 1

ద్వితీయుఁడు : అదిగో పూజ్యురాలైన విదేహ రాజపుత్రి—
కంపమాన భుజంగమాంగన విధాన
చలిత పుష్పిత లతిక యట్టులను దోఁచు –
వనము నందుండి సత్తపఃఫలము వోలె
బాలిశునిచేత గొంపోవఁ బడుచు బలిమి. 2

ఇరువురు : అయ్యలారా! రక్షింపుఁడు. రక్షింపుఁడు.

ప్రథ : (పైకిచూచి) ఓహో! జటాయువు కాఁబోలు! తన మిత్రుఁడైన దశరథేశ్వరుని ఋణవిముక్తికై సరిగ నిదే సమయమున వియత్పథమున విజృంభించి "నేనిచ్చటనుండ నెచ్చటకు బోయెదవురా!" అనుచు రావణుని నిల్వరించుచున్నాఁడు.

ద్వితీ : ఇదిగో! రావణుఁడు రోషావేషముతో గ్రుడ్లు త్రిప్పుచు వెనుకకుఁ దిరిగినాఁడు.

ప్రథ : ఇటు దశకంఠుఁడు!

ద్వితీ : అటు జటాయువు!

ఇరువురు : ఔరా! అంతరిక్షములో సంగ్రామ మారంభమైనది.

ప్రథ : కాశ్యపా ! కాశ్యపా ! ఆ ఖగనాథుని సామర్థ్యమును సంద ర్శింపుము.

ఒకసారి దివిజారి నుట్టూత లూగించు
నంతంత ఱెక్క లల్లార్చి యార్చి
ఒకమాటు రివ్వున నుప్పరంబున కేగి
గిరగిర వలయముల్ దిరిగి వచ్చు
ఒకతూరి యెదురేగి యుక్కునాగలి వంటి
ముక్కుతో నెమ్మోము వ్రక్కలించు
ఒకతేప తీక్ష్ణ కంటక సన్నిభములైన
గోళ్లతో గుండెలు కుళ్లగించు
అతి భయంకరమైన వజ్రాయుధంబు
కొండపైఁ బడి బండలు గూల్చునట్లు
పక్షి ప్రతిపక్షిపై దూకి ప్రతిఘటించి
నఖములన్ గ్రుచ్చి మేని కండలను రాల్చు. 3

ద్వితీ : అయ్యో ! పాపము ! రావణుఁడు రౌద్రావేషముతో నిజ నిశితాసిధారచే నా పక్షీంద్రుని దక్షిణపక్షమును ఖండించినాఁడు.

ఇరువురు : అయ్యయ్యో ! మహనీయుఁడైన జటాయువు మహీతల మునఁ గూలినాఁడు.

ప్రథ : అయ్యో ! పాపము ! ఈ జటాయు వెంతటి పవిత్ర చరిత్రుఁడు !

రిపుని గ్రీడామయూరము ట్లపహసించి
దీప్తి పొంగార దైత్యేంద్రు తేజ మడచి
స్వబలసాధ్య ప్రయత్నమ్ము సలిపి, కూలె
మత్తగజ భగ్న వన్యద్రుమంబు వోలె ! 4

ఇరువురు : ఇతనికి స్వర్గలోకము సంప్రాప్త మగుగాక !

ప్రథ : కాశ్యపా ! రమ్ము. ఈ వృత్తాంతమును పూజ్యుఁడైన రామచంద్రునకు నివేదింతము.

ద్వితీ : మంచిది. అట్లే చేయుదము.

( ఇరువురు నిష్క్రమింతురు. )

—: ఇది విష్కంభకము :—

( కాంచుకీయుఁడు ప్రవేశించును. )

కాంచు : ఓహో ! ఎవరిక్కడ ? ఈ కాంచన తోరణ ద్వారమును గాచుచున్న దెవరు ?

ప్రతీహారి : ( ప్రవేశించి ) ఆర్యా ! నేను విజయను: ఏమి యాజ్ఞ.

కాంచు : విజయా ! శ్రీరామ సందర్శమునకై జనస్థానమున కరిగిన యార్య సుమంత్రుఁడు మరలి వచ్చినాఁడు.

ప్రతీ : ఆర్యా ! సుమంత్రులవారు సఫల మనోరథులై వచ్చిరనుకొందును.

కాంచు : అమ్మా ! అది నాకు తెలియదు.

మానసస్థిత శోకదావానలమ్ము
కతన శోషిత వదనుఁడై కాననుండి
మరలి వచ్చిన యార్యసుమంత్రు నిపుడె !
చూచి నా హృదయమ్ము సంక్షుభిత మయ్యె. 5

ప్రతీ : ఆర్యా ! మీ మాటలు విన్న తరువాత నా యంతరంగముకూడ నాందోళిత మగుచున్నది.

కాంచు : అమ్మా ! ఇంకను నిచ్చటనే యున్నావా ? శీఘ్రముగాపోయి విన్నవింపుము.

ప్రతీ : ఆర్యా ! ఇదిగో విన్నవించెదను. ( నిష్క్రమించును. )

కాంచు : ( అవలోకించి ) ఆహా ! పూజ్యుఁడైన కుమార భరతుఁడు సుమంత్రాగమన సంజనిత కౌతూహల హృదయముతో వల్కలవసనుఁడును, జటాధారియునై యిటే వచ్చుచున్నాఁడు.

మండిత సద్గుణుండు శతమన్యు నిభుండు ప్రమత్త విద్విష
ద్దండధరోపముండు హరిదశ్వకులాభరణుండు బాల వే
దండ సమానయానుఁడు యథావిధి రక్షిత సర్వధారుణీ
మండలుఁ డల్లదే ద్యుతిసమంచితుఁడై భరతుండు వెల్గెడున్. 6

*( భరతుఁడు ప్రతీహారి ప్రవేశింపరు. )*

భర : నిజమా ! విజయా ! ఆర్య సుమంత్రులు మరలి వచ్చినారా ?

ఆర్యు దర్శించి తదనుగ్రహమ్ము నంది
వరము గైకొనివచ్చె నీ భరతుఁ డపుడు ;
రాము జననయన మనోభిరాముఁ జూచి
మరలి వచ్చిరా ఆర్యసుమంత్రు లిపుడు ! 7

కాంచు : ( సమీపించి ) జయము జయము రాజకుమారులకు.

భర : మంచిది. ఆర్యసుమంత్రు లెక్కడ ?

కాంచు : ఇక్కడే. కాంచన తోరణ ద్వారమున.

భర : ఐన, వారిని వెంటనే ప్రవేశపెట్టుము.

కాంచు : చిత్తము. *( ఇరువురు నిష్క్రమింతురు. )*

*( సుమంత్రుఁడు ప్రతీహారి ప్రవేశింతురు. )*

సుమంత్రుఁడు : ( శోకముతో ) అక్కటా ! ఎంత కష్ట మెంత కష్టము !

అనుభవించితి ధరణి నాయకుని చావు
గాంచితిని రాకుమారు నిక్కట్లు గూడ
ఆలకించితి సీతాపహరణ మిపుడు
మోస మొనరించె నన్ను నా మొండి బ్రతుకు. 8

ప్రతీహారి : ( సుమంత్రునితో ) ఆర్యా ! ఇటు. ఇటు. ఇరుగో ప్రభువులు ! సమీపించుఁడు.

సుమం : ( సమీపించి ) జయము జయము రాకుమారులకు.

భర : ఆర్యా ! జగత్ప్రసిద్ధమైన పితృభక్తిని వీక్షించితిరా ? ద్విగుణీకృతమైన యరుంధతీ దివ్యచారిత్రము నాలోకించితిరా ? నిర్హేతుకమైన వనవాసమును గావలెనని వరించిన సౌభ్రాత్రమును సందర్శించితిరా?

( సుమంత్రుఁడు విచారముతో వెలఁబడును. )

ప్రతీ : రాజకుమారు లార్యుల నడుగుచున్నారు !

సుమం : ఏమీ ! నన్నా యడుగునది ?

భర : ( స్వగతము ) అత్యధికమైన దీ యాయాసము ! సంతాపాతిశయముచే మనస్సు మనస్సులో లేదు. ( ప్రకాశముగా ) ఆర్యులు మధ్యమార్గమునుండియే మరలి వచ్చితిరా ?

సుమం : కుమారా ! నీ పనుపున శ్రీరాముని దర్శించుటకై జనస్థానమునకు బయలుదేరిన నేను మార్గమధ్యమునుండియే మరలివచ్చుట యెట్లు ?

భర : ఐనచో వారు క్రోధవశముననా లజ్జావశముననా దర్శనమీయనిది ?

సుమం : కుమారా !

ఆగ్రహ మ్మెందు నెటు వినీతాత్ములందు ?
నిశ్చలాత్మల కెట్లు జనించు లజ్జ ?
కాని కాంచితి వారలు లేని కతన
పొల్పు దరిగిన శూన్యతపోవనమ్ము. 9

భర : అట్లైనచో వారెచ్చటి కేగినట్లు ?

సుమం : కిష్కింధయను వానరప్రదేశమొకటి కలదు. అక్కడి కరిగిరని వింటిని.

భర : అక్కటా ! మానవుల మంచిచెడ్డలు మర్కటముల కవిజ్ఞాతములు గదా ! అందుచే వారచ్చట కష్టముల పాలైయుందురు.
సుమం : కుమారా ! తిర్యగ్జంతువులుగూడ నుపకర్తలను గుర్తింపఁగలవు.
భర : ఆర్యా ! అది యెట్లు ?
సుమం : కుమారా ! వినుము.

అన్నయగు వాలి రాజ్యంబు నపహరించి
గెంటివేయంగ, వచ్చి సుగ్రీవుఁ డుండె
పర్వతాగ్రాన, నపహృత భార్యుఁ డతఁడు
తుల్యదుఃఖాత్ముచే దుఃఖదూరుఁ డయ్యె. 10

భర : ఆర్యా ! ఏమంటిరి ! తుల్యదుఃఖాత్ముచేత ననియా ?
సుమం : (స్వగతము) అక్కటా సమస్తమును చెప్పనే చెప్పితిని. (ప్రకాశముగా) కుమారా ! మఱేమియులేదు. ఐశ్వర్యభ్రంశమున తుల్యత్వమని నా యభిప్రాయము.
భర : ఆర్యా ! ఏల దాచెదరు ? మీరు సత్యము చెప్పనిచో స్వర్గస్థులైన మహారాజు చరణముల యాన !
సుమం : ఇంకేమి చేయుదును ! కుమారా ! వినుము.

రాక్షసేశ్వరు నెడల వైరము వహించె
రామచంద్రుండు మునిజన రక్షణార్థి
యౌచు, నందులకై సీత నపహరించె
నకట ! రావణుం డాత్మమాయాబలాన ! 11

భర : ఏమంటిరి ! అపహరించెననియా ! (మూర్ఛిల్లును.)
సుమం : కుమారా ! ఊరడిల్లు మూరడిల్లుము.
భర : (కొంచెము తేరుకొని) అయ్యో ! ఎంత కష్టము !

బాంధవులచేత జనకుచే బాధితుఁడయి
నిలచె దుఃఖాన కాన, నందులకు తోడు
సతిని గోల్పోయి మా రామచంద్రుఁ డకట !
ఘనఘనాచ్ఛాదితుండయి కాంతి దొఱఁగె. 12

ఆహా! ఇప్పు డేమి చేయుదును! మంచిది. కానిండు. ఆర్యా! మీరు నా వెంట రండు.

సుమం: అట్లే. *(ఇరువురు పరిక్రమింతురు.)*

సుమం: వలదు వలదు. కుమారా! లోనికి పోవలదు. ఇది దేవేరుల చతుశ్శాల.

భర: ఇచ్చటనే నాకు పనియున్నది. ఎవరీ ద్వారమున?

ప్రతీ: (ప్రవేశించి) జయము జయము రాజకుమారులకు! నేను విజయను.

భర: విజయా! నారాక పూజ్యురాలైన రాణిగారికి నివేదింపుము.

ప్రతీ: ఏ రాణిగారికి నివేదింతును?

భర: నన్ను రాజును జేయదలచిన రాణిగారికి.

ప్రతీ: (స్వగతము) హా! ఇదేదో ప్రాప్తించినది! (ప్రకాశముగా) అట్లే ప్రభూ! *(నిష్క్రమించును.)*

*(కైకేయి ప్రతీహారి ప్రవేశింతురు.)*

కైకేయి: విజయా! నన్ను దర్శించుటకు భరతుఁడు వచ్చినాఁడా?

ప్రతీ: చిత్తము దేవీ! ఆర్యసుమంత్రులు రాజకుమారుఁడైన శ్రీరాముని కడనుండి తిరిగి వచ్చినారు. వారితోఁగూడి కుమార భరతులు మీ దర్శనము గోరుచున్నారు.

కైకేయి: (ఆత్మగతము) భరతుఁ డెటువంటి పోటు మాటలతో నన్ను పాలంభించునో!

ప్రతీ: దేవీ! రాజకుమారులు రావచ్చునా?

కైకేయి: పొమ్ము. వెంటనే ప్రవేశపెట్టుము.

ప్రతీ: చిత్తము దేవీ! (భరతుని సమీపించి) జయము జయము రాజ కుమారులకు! దయచేయుఁడు.

భర : విజయా ! విన్నవించితివిగదా !

ప్రతీ : చిత్తము.

భర : ఐనచో ప్రవేశింతము.

(భరత సుమంత్రులు లోనికి ప్రవేశింతురు.)

కైకేయి : కుమారా ! రాముని సన్నిధినుండి యార్యసుమంత్రు లరు దెంచినారని విజయ విన్నవించుచున్నది.

భర : నే నంతకంటె ప్రియవర్తమాన మమ్మగారి కందింప వచ్చితిని.

కైకేయి : నాయనా ! కౌసల్యా సుమిత్రలనుగూడ పిలిపింతునా ?

భర : వలదు. ఇది వారు వినదగిన విషయము కాదు.

కైకేయి : (స్వగతము) ఇదేమై యుండునో ! (ప్రకాశముగా) నాయనా ! చెప్పుము.

భర : ఆలకింపుము.

త్వన్నియోగాన రాజ్యసంపదఁ దొలఁగి
యరిగె నే గుణశాలి ఘోరాటవులకు
నతని యర్ధాంగి యపహృత యయ్యె నకట !
తీరెనా పూర్తిగా నీ మనోరథమ్ము ? 13

కైకేయి : అయ్యో !

భర : సత్త్వసంపన్ను లభిమాన శౌర్యధుర్యు
లైన యిక్ష్వాకులకు వధూపహరణబాధ
అక్కటా ! ప్రాప్తమయ్యె మహాపచారాల !
నిన్ను కోడలిగాఁ జేసికొన్న కతన. 14

కైకేయి : (ఆత్మగతము) మంచిది. ఇదే వెల్లడింపఁదగిన సమయము. (ప్రకాశముగా) నాయనా ! మహారాజు శాపము నీ వెఱుఁగవు.

భర : ఏమీ ! మహారాజు శపింపఁబడిరా ?

కైకేయి : (సుమంత్రునితో) ఆర్యా ! వివరముగా వినిపింపుము.

సుమం : రాజ్ఞి యాజ్ఞ. కుమారా! ఆకర్ణింపుము. మున్నొకప్పుడు మృగయా వినోదార్థమై మహారాజరణ్యమున కరిగినాఁడు. అచ్చోట నొక సరోవరములో నొక మునికుమారుడు కలశమును ముంచు చుండగా వన గజ బృంహితము ననుకరించు శబ్దమైనది. ఆ శబ్దము విని వనగజమను భ్రాంతితో నాయన శబ్దభేదియగు శరమును బ్రయోగించినాఁడు. ఆ బాణాఘాతముచే నయనహీనుఁడైన జనకునకు నయనప్రాయుఁడైన మునితనయుఁడు మృతిజెందినాఁడు.

భర : ఏమంటిరి! మునితనయుఁడు మృతిజెందెననియా? పాపము శాంతించుగాక! పాపము శాంతించుగాక! అనంతరము?

సుమం : అట్లు మృతుఁడైన యాత్మనందను నవలోకించి—

నిత్యసత్యవచస్వి మౌనిప్రభుండు
బిట్టు విలపించి, ప్రభుని శపించెఁ గినుక —
"భూపతీ! నావలెనె నీవు పుత్రశోక
శీర్ణ హృదయుండవై నశించెద" వటంచు. 15

భర : అమ్మో! దురదృష్టమనిన నిదియే!

కైకేయి : నాయనా! ఈ కారణమువలన నపరాధమంతయు నేను భరించి ప్రియకుమారుఁడైన రాముని వనములకంపితిని. కాని రాజ్యలోభమున మాత్రము కాదు. ఏమన మహారాజునకు మహర్షి శాపము పుత్రవియోగమునఁ గాక నన్యవిధమున నపరిహారణీయము గదా!

భర : పుత్రవియోగమే యావశ్యకమైనచో నిరువుర మొక్కటేగదా! మఱి కానన భూములకు నేనేల పంపఁబడలేదు?

కైకేయి : నాయనా! మాతుల గృహనివాసమున కలవడిన నీ వియోగ మాయనకు సహజమేకదా!

భర : ఐనచో చతుర్దశ వర్షములని నిర్ణయించుటకు కారణ మేమి?

కైకేయి : నాయనా! చతుర్దశ దివసము లనఁబోయి వ్యాకుల హృదయముతో చతుర్దశ వర్షములని నోరు జారితిని.

భర : విశేషముగా విచారింపవలసిన విషయమే యిది! మఱి గురు
జనుల కిది యంతయు విదితమేనా ?
సుమం : కుమారా! వశిష్ఠ వామదేవాదు లందఱకు విదితము సమ్మత
మునుగూడ.
భర : ఆహా! వారు త్రిలోక రహస్యజ్ఞులు గదా! అదృష్టవశమున
నమ్మగారియం దపరాధ మిం దణుమాత్రమును లేదు. తల్లీ!
భ్రాతృస్నేహసముత్పన్నమైన భావావేశములో పూజ్యురాలవైన
నిన్ను దూషించితిని. నన్ను మన్నింపుము. నమస్కారములమ్మా!
కైకేయి : నాయనా! ఏ తల్లి తనబిడ్డని యపరాధమును మన్నింప
కుండును! లెమ్ము లెమ్ము. ఇందు నీ దోష మేమున్నది!
భర : అనుగ్రహీతుఁడను. అమ్మగారి నభ్యర్థించుచున్నాను! ఈనాఁడే
అన్నగారి సహాయార్థమై సమస్త రాజమండలమును సమావేశ పఱ
తును. మఱియు నేనిపుడు——

శిబిరముల నింపి మదగజశ్రేణి దింపి
కడలి తట మెల్ల కటిక చీకటి యొనర్చి
ధాటిమై దాటు సైన్య సంతతుల, జలధి
రాజు నలయింతు రాక్షసరాజుతోడ. 16

ఓహో! ఏమా కోలాహలము! ఎవరక్కడ? అదేమో వెంటనే
తెలిసికొనుఁడు.
ప్రతీహారి : (ప్రవేశించి) జయము జయము రాజకుమారులకు! ఈవిషాద
వార్తవిని పెద్దరాణిగారు మూర్ఛిల్లినారు.
కైకేయి : అయ్యో!
భర : ఏమీ! అమ్మగారు మూర్ఛిల్లినారా!
కైకేయి : నాయనా! రమ్ము. అక్కగారి నోదార్పబోవుదము.
భర : అమ్మా! అక్లే!

(అందఱు నిష్క్రమింతురు.)

---

# సప్తమాంకము

[తాపసుఁడు ప్రవేశించును.]

తాపసుఁడు : నందిలకా ! నందిలకా !

నందిలకుఁడు : (ప్రవేశించి) ఆర్యా ! ఇదిగో వచ్చితిని.

తాప : నందిలకా ! "స్వదారాపహరణమును గావించిన త్రైలోక్య విద్రావణుఁడగు రావణుని సంహరించి, రాక్షసగణ విరుద్ధమైన ప్రవృత్తి గలవాఁడును, సుగుణగణ విభూషణుఁడును నైన విభీష ణుని రాజ్యాభిషిక్తుని జేసి, మహామహిమోపేతుఁడైన శరత్కాల నిర్మల నీలాకాశరాకాచంద్రునివంటి రామచంద్రుఁడు దేవదేవర్షి సంఘములచే సంస్తూయమానయైన పవిత్ర చరిత్రయగు సీతాదేవితో ఋక్షరాక్షస వనచర పరివృతుఁడై యరుదెంచినాఁడు. కనుక నేఁడీ యాశ్రమ పదములో యథాశక్తి సర్వము సంసిద్ధము చేయ వలె" నని మన కులపతులవా రాదేశించుచున్నారు

నంది : ఆర్యా ! సర్వమును సంసిద్ధమే కాని—

తాప : కాని యేమి ?

నంది : ఇట విభీషణుని బంధువులైన రాక్షసులు పెక్కుమంది యున్నారు. వారి యాహార విహార విషయము కులపతులవారే యాలోచింప వలయును.

తాప : అదేమి ?

నంది : వారు మన పైనఁబడి విఱుచుకొని తిందురు.

తాప : భయము వలదు. వారు విభీషణుని యాజ్ఞ కడుగు దాటు వారు కారు.

నంది : ఆ బుద్ధిమంతులైన రాక్షసులకు నమస్కారము.

(నిష్క్రమించును.)

తాప : ( చూచి ) అడుగో పూజ్యుఁడైన శ్రీరామచంద్రుఁడు.

"జయము నరవర ! శత్రునాశకుఁడ వౌచు
ధరణి నేలు మేకాత పత్రముగ నింక. "
అని నుతింపఁ బ్రసన్నమై మునిగణమ్ము
మహికి డిగు మానవేంద్రు విమాన మదిగో ! 1

ప్రభూ ! నీకు జయమగు గాక ! ( నిష్క్రమించును. )

—: ఇది మిశ్ర విష్కంభము :—

*( రాముఁడు ప్రవేశించును. )*

రామ : ఆహా !

అతుల బలోన్నతుం డయిన యా దశకంఠుని రూపుమాపి, వి
శ్రుతగుణ భూమిపుత్రిని విశుద్ధ చరిత్రను స్వీకరించి, మ
త్పితృ ననుశాసనమ్ము నెఱవేఱిచి, వెండియుఁ జేర వచ్చితిన్
సతత మునీంద్ర వాసము ప్రశాంత విశాల వన ప్రదేశమున్. 2

తపస్వినీ జనాభివందనార్థ మరిగిన జానకి యేలనో తడయుచున్నది. ( పరికించుచు ) ఓహో ! ఇదిగో !

"రమ్ము సఖి ! జానకీ రమ్ము ! రమ్ము సీత !
పెద్దకోడలా ! ర" మ్మని పిలుచుచున్న
యార్యకాంతలతో ముచ్చటాడుకొంచు
నల్ల నల్లన వైదేహి యరుగుదెంచు. 3

*( సీత తాపసి ప్రవేశింతురు. )*

తాపసి : సఖీ ! ఇరుగో మీ వారు ! ఆయన ప్రక్కగా నిలఁ బడుము. నిన్నే కాకినిగా నాలోకింపలేకున్నాను.

సీత : ఆహా ! ఇప్పటికిని నా మనస్సునకు విశ్వాసము కలుగుట లేదు. ( సమీపించి ) జయము జయ మార్యపుత్రులకు !

రామ : జానకీ ! జ్ఞప్తియున్నదా ! ఈ జనస్థాన మొకప్పుడు మన నివాసస్థానము. నీవు కష్టపడి కన్నబిడ్డలవలె గారాబముగా పెంచిన యీ మహీరుహములను మఱచియుండవనుకొందును.

సీత : అవు నవును. ఆనాఁడు క్రిందుగాఁ గనుపించిన యీ చెట్ల యాకు లీనాఁడు తలయెత్తి చూడఁదగియున్నవి.

రామ : అవును. కాలచక్రము క్రిందుమీఁదగుచుండును. జానకీ ! అల నాఁ డీయేడాకుల యరటి చెట్టుక్రింద ధవళ వస్త్రధారియైన భరతుని జూచి భయభ్రాంతములై హరిణములు పరువెత్తిపోయినవి. నీకు జ్ఞాపక మున్నదా ?

సీత : ఆర్యపుత్రా ! నా కది చక్కగా జ్ఞాపకమున్నది.

రామ : దేవీ ! ఇదిగో ! మన తపస్సునకు సాక్షీభూతమైన నందివృక్షము. తండ్రిగారి శ్రాద్ధకర్మ నిర్వహణము నుగూర్చి యోజించుచు నిచ్చట కూర్చుండి యుండియే మనము కాంచనమృగమును గాంచితిమి.

సీత : వలదు. వలదు. ఆర్యపుత్రా ! ఆ మాటలు మరల తీసికొని రావలదు. ( భయభ్రాంతురాలగును. )

రామ : భయపడకు దేవీ ! ఆ రోజులు గడచిపోయినవి. ( నలుదిశలు పరికించుచు ) ఓహో ! ఏమి టీ విశేషము !

రేగిన రజస్సు లోధ్ర పరాగసమము
గాలి కెరటాల దిగ్దిగంతాలు ప్రాకె ;
చటుల పటహస్వనాఖిల శంఖరవము
నగరముగ మార్చె నీ కాననమ్ము నెల్ల. 4

లక్ష్మణుఁడు : ( ప్రవేశించి ) జయము. జయము. ఆర్యులకు !
సైన్యచయము తోడ జననీ సమేతుఁడై
రమ్యగుణ గుణాభిరామ ! రామ !
తరలివచ్చె నీదు దర్శనాకాంక్షియై
భ్రాతృ వత్సలుండు భరతుఁ డిటకు. 5

రామ : ఏమేమి ! వత్సా ! సౌమిత్రీ ! భరతుఁడు వచ్చినాఁడా ?

లక్ష్మ : చిత్తము.

రామ : జానకీ ! అమ్మలను వెంటఁబెట్టుకొని వచ్చిన భరతుని గన్నులారఁ గనుగొందువు గాక !

సీత : ఆర్యపుత్రా ! భరతుఁడు రావలసిన సమయముననే వచ్చినాఁడు.

*( మాతృజనముతో భరతుఁడు ప్రవేశించును. )*

భరతుఁడు :

అంబుద విముక్త శుభ్రసుధాంశు వట్లు
క్లిష్టతర కష్టములు దాటి గెలుపుఁగాంచి
జనకజాయుక్తుఁ డగు రామచంద్రుఁ జూడ
వచ్చితి ప్రమోదమున బంధు వరులఁగూడి. 6

రామ : అమ్మలారా ! అభివాదములు.

అందఱు : కుమారా ! చిరంజీవివి కమ్ము. ప్రతిజ్ఞను పరిపాలించి కోడలితోఁగూడి సురక్షితముగా వచ్చిన నిన్నుగాంచు భాగ్యము లభించినది. సంతోషము !

రామ : అనుగృహీతుఁడను.

లక్ష్మ : తల్లులారా ! నమస్కారములు.

అందఱు : కుమారా ! ఆయుష్మంతుఁడవు కమ్ము.

లక్ష్మ : అనుగ్రహింపఁబడితిని.

సీత : అత్త లందఱకు వందనములు.

అందఱు : బిడ్డా ! సౌభాగ్యవతివి కమ్ము.

సీత : ధన్యురాలను.

భర : ( రామునితో ) ఆర్యా ! ఈ భరతుఁడు ప్రణమిల్లుచున్నాడు.

రామ : రమ్ము, రమ్ము. నాయనా ! ఇక్ష్వాకునందనా ! స్వస్తి ! ఆయుష్మంతుఁడవు కమ్ము—

సరిసరి ! ఏది ! ఏది ! ఒక సారి కవాట పుట ప్రమాణ మీ
యురమును విప్పుచేసి విపులోరు భుజాంతరమందు హత్తుకో
మ్మర ! శరదిందుకల్పమగు మోము నొకించుక యెత్తి వేదనా
జ్వర పరిదగ్ధ దేహ మిది చల్లని చూపుల హాయి సేయరా ! 7

భర : కృతార్థుఁడను. ( సీతతో ) పూజ్యురాలా ! భరతుఁడు నమస్క
రించుచున్నాఁడు.

సీత : ఆర్యపుత్రులకుఁ దోడునీడవై వర్ధిల్లుము.

భర : అనుగ్రహింపఁబడితిని ( లక్ష్మణునితో ) ఆర్యా ! ప్రణామములు.

లక్ష్మ : రమ్ము, రమ్ము. నాయనా ! దీర్ఘాయుష్మంతుఁడవు కమ్ము.
ఏదీ ! నన్ను గట్టిగా కౌగలించుకొనుము. (ఆలింగనముచేసికొనును.)

భర : అనుగృహీతుఁడను. ( రామునిచూచి ) అన్నా ! ఈ రాజ్య
భారమును ప్రతిగ్రహింపుము.

రామ : అదేమి నాయనా !

కైకేయి : కుమారా ! అదేకదా మా చిరకాలవాంఛ.

*( శత్రుఘ్నుఁడు ప్రవేశించును. )*

శత్రు :
క్లిష్ట కష్ట భుజంగ సందష్టుఁడయ్యు
చెదర దెవ్వని సుగుణ సంపద రవంత ;
అట్టి రావణాంతకు ముఖాబ్జావలోక
నమ్మునకు తొందరించెడు నా మనమ్ము. 8

( సమీపించుచు ) ఆర్యా ! నేను శత్రుఘ్నుఁడను నమస్కరించు
చున్నాను.

రామ : రమ్ము నాయనా ! స్వస్తి. ఆయుష్మాన్ భవ !

శత్రు : అనుగృహీతుఁడను. ( సీతతో ) పూజ్యురాలా ! అభివందనములు.

సీత : నాయనా ! చిరంజీవివి కమ్ము.

శత్రు : కృతార్థుఁడను. ( లక్ష్మణునితో ) ఆర్యా ! అభివందనములు.
లక్ష్మ : స్వస్తి. ఆయుష్మంతుఁడవు కమ్ము.
శత్రు : అనుగృహీతుఁడను. ( రామునితో ) ఆర్యా ! ఇరుగో ! వశిష్ఠ వామదేవులు పౌరసహితముగా మీ యభిషేక సంభారములు సమకూర్చి సందర్శనాభిలాషులై యున్నారు. చూడుఁడు.

మునివరేణ్యులు పుణ్య వాహినుల నుండి
తెచ్చియున్నారు స్వయముగా తీర్థజలము ;
చారుతరమౌత ! అభిషేక వారి సిక్త
తావకానన మార్ద్రి రాజీవమట్లు. 9

కైకేయి : లెమ్ము కుమారా ! అభిషేకము నంగీకరింపుము.
రామ : అమ్మగారి యాజ్ఞ. ( నిష్క్రమించును. )

( తెరలో )

జయము జయము దేవరవారికి ! జయము జయము ప్రభువులకు !
జయము జయము మహారాజులకు ! జయము భద్రముఖులకు !
జయము జయము పూజ్యచరిత్రులైన రావణాంతకులకు !

కైకేయి : అరుగో ! పురోహితులు కాంచుకీయులు మహాశీర్వాదములతో జయజయనాదములతో నందను నభినందించుచున్నారు.
సుమిత్ర : పౌరులు పరిచారకులు సజ్జనులు కుమారుని విజయమును వినుతించుచున్నారు.

( తెరలో )

ఓ జనస్థాన వాసులగు తాపసులారా ! వినుఁడు వినుఁడు.

అప్రతిమ రిపు ప్రభవ తమౌఘమెల్ల
శౌర్య సూర్య మయూఖాళి సంహరించి,
సీతను గుణ ప్రపూతను స్వీకరించి
రాముఁడు సమస్త లోకాభిరాముఁ డలరు. 10

కైకేయి : ఆహా ! కుమారుని విజయఘోషణము వీనులవిందు గావించు చున్నది.

*( కృతాభిషేకుఁడై రాముఁడు సపరివారముగా ప్రవేశించును. )*

రామ : ( ఆకసమువంక చూచి ) ఓ తండ్రీ !

నెమ్మది నాకలోకమున నేనిఁ బ్రశాంతిగ తుష్టిఁగొమ్ము దై
న్యమ్ము పరిత్యజించి ; జనకా ! భవదీయ మనోభిలాష రూ
పమ్ము గ్రహించె, రాజ్య పరిపాలన మూనితి, రాజునైతి, న్యా
యమ్ముగ నేలెదన్ బ్రజల హాయిని ధ్యేయముగా గణించుచున్.

భర :

ప్రవిమల రాజశబ్దమున భాసిలి, తీర్థజలాభిషిక్తతం
దవిలి, సితాత పత్రమును దాలిచి, రత్నకిరీటమూని, పై
భవమున పౌరబృందముల వందనము ల్గొనుచున్న రాఘవున్
నవశశి నట్టు లెంత గనినన్ మది తృప్తి వహింప దింతయున్. 12

శత్రు :

భవ్యుఁ డగు నార్యు నభిషేక వారిధార
కడిగి వైచెను మా కుల కల్మషమ్ము ;
తిరిగి పూర్వ వైభవము సాధించుకొనును
మా కులము చంద్రు రాకతో లోక మట్లు. 13

రామ : వత్సా ! సౌమిత్రీ ! నేను రాజ్యస్వీకారము చేసితిని.

లక్ష్మ : అదృష్టవశమున నన్నగారు వైభవోపేతులై వర్ధిల్లుచున్నారు.

కాంచు : ( ప్రవేశించి ) జయము జయము. మహారాజులకు ! మీ వెంట వచ్చిన విభీషణుఁడు, సుగ్రీవుఁడు, నీలుఁడు, జాంబవంతుఁడు, హనుమంతుఁడు మొదలైన వారి యానంద సమయమున తమ ధన్యవాదములను దేవరవారికి మనవి చేసికొనుచున్నారు.

రామ : ఈ యభ్యుదయ మంతయు సహచరులైన వారి యనుగ్రహమే యని తెలుపుము.

కాంచు : చిత్తము. మహారాజుల యనుజ్ఞ.

కైకేయి : ధన్యురాలను. కుమారా ! నే నీ యభ్యుదయ మహోత్సవ ముల నయోధ్యలోఁ జూడఁగోరుచున్నాను.

రామ : అట్లే చూడఁగలవు తల్లీ ! ( చూచి ) ఆహా ! ఈ వనమంతయు నూత్న ప్రభాపుంజముతో ప్రభాకరునివలె ప్రకాశించుచున్నది. ( ఆలోచించి ) ఏమిది ! ఓహో ! తెలిసినది. రావణుని పుష్పక విమానము వినువీధిలో వచ్చి నిలచినది. ఆహా ! వెనుక చెప్పిన ప్రకారము తలఁచిన మాత్రముననే దరికి వచ్చినది. లెండు. మీ రందఱు నీ పుష్పకము నారోహింపుఁడు.

*( అందఱు పుష్పక విమానములో కూర్చుండుదురు. )*

రామ : ఆప్త మిత్రులు బంధులు ననుగమింప
నరుగు చున్నాఁడ నేఁడయోధ్యాపురమ్ము

లక్ష్మ : ఉదయశిఖరిఁ దారలతోడ నుదయమైన
చంద్రువలె నిన్ జనుల్ కనుగొంద్రు గాక ! 14

—: భరత వాక్యము :—

జానకీ దేవితో బంధుజనము తోడ
జగతిఁ బాలించు శ్రీరామచంద్రు నట్లు
సకల సౌభాగ్య లక్ష్మి ప్రసన్నుఁ డగుచు
వసుధ నేలుత మా రాజవల్లభుండు ! ! !

*( అందఱు నిష్క్రమింతురు. )*

---